జనశ్రుతి ప్రచురణ నెం. 5

**Sampurna Viplavam Krishnamurti**
(Total Revolution Krishnamurti)
By J.S. Raghupathi Rao
15-79, Padmavati Nagar
Tirupati-517 502 (0877-2240827)

ప్రచురణ - 2003 సం॥

ప్రతులు : 1000

వెల : రూ. 30/-

ప్రతులకు :-

నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ మందిర్ ఎదురువీధిలో,
కాచిగూడ క్రాస్ రోడ్, హైదరాబాద్. ఫోన్ : 040-24652387

డి.టి.పి. : వినాయక గ్రాఫిక్స్, తిరుపతి.

ముద్రణ :-

శ్రీ పారాశర్య ముద్రాక్షరశాల, శ్రీవ్యాసాశ్రమము, చిత్తూరు జిల్లా.

# విషయసూచిక


1. రచయిత వివరణ

2. పరిష్కర్త హృదయం

వ్యాస విభజన

I. ఎవరీ జిడ్డు కృష్ణమూర్తి ?

1. జీవన తత్వ దర్శి జిడ్డు కృష్ణమూర్తి 1

2. సంతత త్యాగమూర్తి 5

3. తత్వాలకు తలమానికం కృష్ణమూర్తి తత్వం 8

II. ఏముందీ కృష్ణమూర్తి లో

4. కృష్ణమూర్తి వినూత్న ఆవిష్కరణ 12

5. కృష్ణమూర్తి అవగాహనలో ఔన్నత్యం 17

6. సృజనాత్మకత కృష్ణమూర్తి 22

7. జీవిత సమగ్రత కృష్ణమూర్తి 23

8. సత్యానురక్తి - జె.కె. దృక్పథం 29

9. క్రొత్తమిలీనియంలో క్రొత్తదనం కృష్ణమూర్తి 32

III. ఏం చేశాడు కృష్ణమూర్తి

10. నేటి సమస్యలకు మేటి సమాధానం కృష్ణమూర్తి 34

11. ద్రష్ట దృశ్యం ఒకటైనవాడు 36

12. ఆధ్యాత్మిక వ్యాపారాన్ని అరికట్టిన కృష్ణమూర్తి 39

13. తాత్త్విక స్పందనం - మానవతానందం 41

IV ఎంతటివాడు ఈ కృష్ణమూర్తి?

14. సంపూర్ణ మానవుడు కృష్ణమూర్తి 47

15. కృష్ణమూర్తి - మార్క్స్ తత్త్వం 48

16. ఎందుకు కృష్ణమూర్తిని అర్థం చేసుకోవాలి 56

17. దేశం కృష్ణమూర్తిని రక్షించుకోవాలి 57

V. ఏమి చెప్పాడు ఈ కృష్ణమూర్తి ?

18. జీవితం అంటే ఏమిటి? 61

19. ఆంతరంగిక జీవితం - మానవ సంబంధం 64

20. జీవితం పుణ్యమూ కాదు - పాపమూ కాదు 70

21. ఆత్మ పరిశీలన 72

22. వ్యక్తి మారితేనే సమాజం మారుతుంది 74

# వివరణ

కృష్ణమూర్తి పుస్తకాలు చదివినాక, వారి ప్రసంగాలు స్వయంగా విన్నాక, పూర్తిగా నచ్చినాక 1987 నుంచి వారిపై వ్యాసాలు వ్రాయడం మొదలు పెట్టాను. చర్చాగోష్టులు జరిపాను, రేడియో ప్రసంగాలు చేశాను, సమావేశాల్లో మాట్లాడాను. కొన్ని వ్యాసాలలో ఈ పుస్తకం రూపొందించాను.

ఇపుడు కృష్ణమూర్తి పుస్తకాలు తెలుగులో చాలా వచ్చాయి. అంతకు ముందే నేను తెలుగురచన ఆరంభించాను. అచ్చువేయడం ఆలస్యం చేశాను. కృష్ణజీకున్న అనుభూతి స్థాయిలో యథాతథంగా ఆయన్ని అర్థం చేసుకోవడం ఏ భాషలోనైనా కష్టమే. ఇంగ్లీషు తెలియని వారు సొంత బాషలో అర్థం చేసుకోవలసిందేగదా! అందుకే కొంత వివరణ అవసరం. అన్నిటికన్నా అవగాహన ప్రధానం.

ఈ వ్యాసాలు స్వతంత్రమైనవి. అంటే, నాకు అర్థమైన రీతిలో వ్రాసినవి. విషయం వారు చెప్పిందే. వివరణ, బావం, బాష నావి. నా అవగాహనను బట్టి వ్రాశాను. విషయానికి దూరంగా మాత్రం పోలేదు, అంతవరకు గట్టిగా చెప్పగలను. అందించ గల్గడం, అందుకోలేక పోవడం వేరే సంగతి. బుద్ధిపరంగానైనా ఉన్నదున్నట్లు అర్థం చేసుకోవడం సాధ్యమని నా ఉద్దేశం. అందుచే క్రొత్తవారికి, ఆసక్తి పరులకు, ఇంగ్లీషు తెలియని వారికి, ప్రశ్నించేవారికి, ప్రవేశించేవారికి ఈ వ్యాసాలు ప్రయోజన పడగలవని భావిస్తున్నాను. పాతవారికి కూడ పరిశీలనార్హమైనవి.

ఈ వ్యాసాల్లో పునరుక్తులుంటాయి. కాని సందర్భం, వ్యక్తీకరణ వేరుగా ఉండొచ్చు. కృష్ణమూర్తి పుస్తకాలలో ఒకే విషయం వారు అనేక పర్యాయాలు చెప్పినట్లు ఉంది. అయితే అది అనుభూతి గనుక ఎప్పటికప్పుడు క్రొత్తగానే ఉంటుంది. అర్థం చేసుకోదలచిన వారికి కొద్ది పునరుక్తాలు అడ్డురావని తలుస్తున్నాను. ఇంతకంటే లోతుగా కూడ వ్రాయడం అవసరం. ఆ ప్రయత్నమూ చేస్తాను. వ్యాసాలు పరిశీలించి, పరిష్కరించి, ప్రూఫులు చూసిన శ్రీస్వామి అచలానంద సరస్వతి వారికి, సలహాలందించిన శ్రీ ఎ.టి. బాబాజీ గారికి కృతజ్ఞతలందిస్తున్నాను.

18-8-03

తిరుపతి.

\- రచయిత

## పరిష్కర్త హృదయం

# నా మార్గదర్శి ఈ కృష్ణమూర్తి

- స్వామి అచలానంద సరస్వతి

సన్యాసానికి పూర్వం నేను కొంతకాలం శ్రీకాళహస్తిలో, శుకబ్రహ్మ ఆశ్రమంలో ఉన్నాను. ఆ కాలంలోనే శ్రీరఘుపతిరావుగారు నాకు పరిచయ మయ్యారు. వారు శ్రీకాళహస్తిలో ప్రతినెల జిడ్డుకృష్ణమూర్తి అధ్యయన సమావేశాలను ఏర్పాటు చేస్తుండేవారు. నేను కూడా వాటికి వెళ్ళి, ఆ చర్చల్లో పాల్గొనేవాణ్ణి.

అప్పటికి కృష్ణమూర్తితో నాకు అంతంత మాత్రమే పరిచయముండేది. ఈ సమావేశాల మూలంగా కృష్ణమూర్తిని లోతుగా అధ్యయనం చేసే అవకాశం కలిగింది. నిజం చెప్పాల్సి వస్తే, నన్ను కృష్ణమూర్తితో మునుముందుగా పరిచయం చేసిన వారు శ్రీబోధ చైతన్యగారు. వారు మద్రాసునుండి వెలువడే 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికకు సంపాదకులుగా ఉండేవారు. నేను ఆ పత్రికకు వ్యాసాలు గట్రా రాస్తూ ఉండేవాణ్ని. కొంత వరకు కృష్ణమూర్తి టాక్స్ చదివాను. తర్వాత శ్రీకాళహస్తిలో శ్రీ రఘుపతిరావుగారి సమావేశాల్లో, కృష్ణమూర్తిని మరింత లోతుగా పరిశీలించగల్గాను. రఘుపతిరావుగారితో చర్చించేవాణ్ని. ఇలా నాకు కృష్ణమూర్తి ఏమిటో అవగాహన కాసాగింది. ఆ సమయంలోనే, శ్రీ రఘుపతిరావుగారు రచించిన 'జిడ్డు కృష్ణమూర్తి జీవన దర్శనా'న్ని అచ్చుకు ముందే ఆమూలాగ్రంగా చూడగలిగాను.

జిడ్డుకృష్ణమూర్తి అవగాహన అవుతున్న కొద్దీ, సత్వరమే - వేగంగా, నాకు తెలియకుండానే, నాలో అనూహ్యమైన ఆంతరంగిక మార్పు రావటం ఆరంభ మయింది. నేనప్పటికి సంప్రదాయ బద్ధమైన నైతిక - ధార్మిక - ఆధ్యాత్మిక జీవితానికి ప్రాధాన్యం ఇచ్చేవాణ్ణి. కాని వాటి మూలంగా నా జీవితం మరింత సంఘర్షణాత్మకంగా తయారైంది. నా సంకల్పానికి విరుద్ధంగా నేను అహంకారినై, అందరితో తీవ్రంగా సంఘర్షించేవాణ్ణి. నాకు, 'అసలు మార్గం ఏదీ?' అని తెలిసేదేకాదు.

కాని శ్రీ రఘుపతిరావుగారి సహచర్యంలో వారి సమావేశాల మూలంగా, నాకు కృష్ణమూర్తి అధ్యయనం చాలా లోతుగా జరిగింది. ఈ అధ్యయనం నాకు 'నామార్గాన్ని' చూపించింది. ఆ క్షణం నుండి నా జీవిత విధానమే మారిపోయింది. నా జీవితం చాలా తేలిక అయిపోయింది.

ముందుగా నేను తెలుసుకొన్న సత్యం ఒకటుంది. 'లౌకిక జీవితం - పారమార్థిక జీవితం' అంటూ రెండు వేరు - వేరు జీవితాలు లేవని గ్రహించాను. ఈ గ్రహింపుతో నాలోని 90% సమస్యలు - సంఘర్షణలు అదృశ్యమైపోయాయి. నేనంతవరకు జీవించిన విరక్తిమయ జీవితం, ఒక విక్షిప్త - వెర్రిజీవితం అని స్పష్టమయింది. నేను జీవితాన్ని ద్వేషిస్తున్నానన్న సంగతి విదితమైంది. నేను జీవన సమరాంగణం నుండి పారిపోతున్నానని గుర్తించడం జరిగింది. తద్వారా నేనెంతగా నష్టపోయానో తెలుసుకున్నాను. వెంటనే నేను నా జీవితధోరణిని, శైలిని మార్చుకున్నాను.

"జీవితం అఖండం - మొత్తం ఒకటే అందులో విభాగాలు ఉండటానికి వీలులేదు. బాహ్యం - ఆంతరికం అని, భౌతికం - ఆధ్యాత్మికం అని రెండు రకాల జీవితాలుండవు. జీవితాన్ని మనం ఎలా స్వీకరిస్తే, అది అలా తయారవుతుంది" అని గ్రహించాను. నా జీవితాన్ని మొత్తం, నా దైనందిన జీవితాన్ని మొత్తం ఆధ్యాత్మిక మయం చేసుకోదలిచాను. ప్రయత్నంలోకి దిగాను.

మొత్తం జీవితానికి కేంద్రం 'మనసు'. దీని తీరుతెన్నులను బట్టి, మన జీవితం భౌతికంగానూ కావచ్చు, ఆధ్యాత్మికంగానూ కావచ్చు. రెండూ ఒకేచోట ఉండవు. మనసును అనుసరించి జీవించామా, అది భౌతికం అవుతుంది. మనసును నిషేధించి జీవించామా, అది ఆధ్యాత్మికం అవుతుంది - అన్న సత్యం జె.కె. ద్వారా అవగతం అయింది. జీవితం 'అహం' చుట్టూ తిరుగుతూ ఉంటుంది. ఈ అహం లేకపోతే, జీవితం ఆధ్యాత్మికం అవుతుంది - అని స్పష్టమయింది. కాబట్టి మనం భౌతిక - ఆధ్యాత్మిక జీవితాలతో కాక, ఈ అహంతో డీల్ చేయవలసి ఉంటుందని గ్రహించాను.

ఈ అహం ఎక్కడ చెలరేగుతూ ఉంటుందో, అక్కడే దాని పోకడలను - నడకలను అర్థం చేసుకోవలసి ఉంటుంది. అంతేగానీ, మరెక్కడికో వెళ్ళి అర్థం చేసుకోలేము. అందుకని ఆశ్రమాలకు - హిమాలయాలకు - మఠాలకు - మరేవేవో కేంద్రాలకు వెళ్ళటం వ్యర్థ ప్రయాస అవుతుందని తెలిసిన మరుక్షణమే - అన్నింటినీ వదలి వేశాను. మామూలు జీవితంలోనే అహం చర్యలుంటాయి కాబట్టి, ఈ ఈజీవితంలో ఉంటూనే, ఈ 'అహం' పని పట్టాలని నిర్ణయించుకున్నాను.

అహంకు మూలం మనసు. అసలు అహమే మనసు. ఈ మనసులో అహం ఎన్ని రకాలుగా ఉంటుందో, ఎన్ని రకాలుగా పుడుతుందో, ఎన్నెన్ని రకాలుగా

విన్యాసాలు చేస్తుందో, ఎన్ని విధాలుగా ఇది మనిషిని కీలుబొమ్మలా ఆడిస్తుందో, కృష్ణమూర్తి ద్వారా అర్థమయింది. కృష్ణమూర్తి తనను దర్పణంగా మార్చుకోమని పదే - పదే చెబుతుంటారు. నేను అలాగే అతని టాక్స్ - డైలాగ్స్ - రైటింగ్స్‌ను నాకు దర్పణంగా మార్చుకున్నాను. అందుకే కృష్ణమూర్తి నాకు గురువుకాదు, అధికారికాదు, ప్రమాణం కాదు, శాస్త్రం కాదు. కృష్ణమూర్తి నాకు కేవలం స్పష్టమైన నిర్మల దర్పణం మాత్రమే. ఈ నిర్మల దర్పణంలో నన్ను నేను స్పష్టంగా - చాయిన్‌లెన్‌గా చూసుకుంటున్నాను.

మొదట్లో నా స్వరూపం చాలా వికృతంగా కనిపించింది. చూసి భయబీతుడ నయ్యాను. ఇంత చండాలంగా జీవిస్తున్నానా? ఇంత అహంకారిగా - భయస్తునిగా - స్వార్థపరునిగా - కోపిష్ఠిగా జీవిస్తున్నానా? ఎవ్వరినీ లక్ష్యపెట్టకుండా - అందరినీ అవమానిస్తూ - బాధపెడుతూ జీవిస్తున్నానా? - అన్న ఆందోళన కలిగింది. దానితో నా గురించి నాకున్న ఉన్నత అభిప్రాయం ఉత్తమరూపం మాయమయ్యాయి. నేను విశిష్ఠ జీవినని మహోన్నత జీవినని అన్న దురభిప్రాయం నష్టమై పోయింది. ఈ అహంభావం వల్ల నేను సాటి మనుషులను - సంబంధాలను చెడగొట్టు కున్నానని, అవమానించానని, స్వార్థపు అభిమానంలో పెద్దలను సైతం ధిక్కరించా నని అవగతమయింది. నేనెంతగా అంతర్గతంగా పతనావస్థలో ఉన్నానో తెలిసింది.

కృష్ణమూర్తి అనే చక్కని అద్దం మూలంగా, నేను నా వికారాలను మార్చుకున్నాను. వినయం - ప్రేమ - కరుణలు నాలో అసలు లేవని గ్రహించి పరిదిద్దుకున్నాను. నాలోని కర్కశ దౌర్జన్యపూరిత స్వభావాన్ని విడనాడాను. "ఆధ్యాత్మిక జీవిని నేను" అన్న దురహంకారాన్ని వదలి వేశాను. ఈ భావనలన్నీ నా అహంను పెంచేవే తప్ప, నన్ను మనసుకు బానిసను చేసేవే తప్ప, నన్ను అధోగతికి త్రోసివేసేవే తప్ప, నాకు బాట చూపేవి కావని తెలిసిపోయింది. వెంటనే, మరో ఆలోచన లేకుండా, నా ఈ అహంభావాల నన్నింటినీ వదలి వేశాను. జారవిడిచాను. నేనెంత అజ్ఞానంలో ఉన్నానో గ్రహించి, సత్యం వైపు దృష్టి సారించాను.

మనసుకు యజమాని కావటానికి బదులుగా నేను మనసుకు బానిసనై బ్రతుకుతున్నానన్న సత్యాన్ని గ్రహించాను. ఆ క్షణం నుండి నా మనసును, కృష్ణమూర్తి మాటల దర్పణంలో క్షుణ్ణంగా పరిశీలించుకుంటూ వస్తున్నాను. దాని చెరలనుండి, పొరలనుండి బయటపడే ప్రయత్నం చేస్తున్నాను.

కృష్ణమూర్తి అర్థం అవటం. అంటే, మనకు మనం పూర్తిగా అవగతం కావటం. మన మనసు మనకు పూర్తిగా తెలిసిపోవటం. అంతేకాదు, ఆ మనసు చెరలనుండి తక్షణం ముక్తులం కావటం.

ఈ మనసు నుండి తక్షణం ముక్తులు కావాలనే కృష్ణమూర్తి చెప్పే ప్రధానాంశం. దీనికి వారు చెప్పే ఉపాయం అత్యంత సహజమైనది; సంక్లిష్ట మయినది; ప్రయత్నిస్తే సరళమైనది.

Moment by moment choiceless awareness - ఇదీ కృష్ణమూర్తి చెప్పే ఉపాయం. మనం క్షణం - క్షణం మన మనసు కదలికలను - చర్యలను - ఆలోచనలను - భావాలను, ఆవేశాలను - వికారాలను వృత్తులను ఎన్నిక లేకుండా, వ్యాఖ్యానం - విమర్శన - బాగు ఓగుల విచారణ లేకుండా గమనిస్తూ ఉంటే, ఈ మనసు నుండి మనం ఎప్పటి కప్పుడు వెంటనే బయట పడుతుంటాం. ఈ సాధన అనుక్షణం, జీవితాంతం జరుగుతూ ఉండవలసిందే. అంటే ప్రతీక్షణం మనం మన మనశ్శరీరాలకు - ఇంద్రియాలకు - బహ్యాభ్యంతరాలలో సాక్షీమాత్రులమై - జాగరూకులమై ఉండాలి. ఏమాత్రం అప్రమత్తత నుండి జారిపోయినా, మనసు చెరలో చిక్కుకుంటాం. దుఃఖం పాలవుతాం. Watchfulness, witness, observing totally, awareness, attention ఇలాంటి పదాలను కృష్ణమూర్తి, ఈ సాక్షిత్వం కోసం ఉపయోగిస్తారు. దీనినే Meditation అంటారు. నిరంతరం ఎరుక కలిగి యుండటం - సాక్షీగా ఉండటం - జాగృతులై ఉండటం. అప్రమత్తులై ఉండటం ధ్యానం అని వారి ఉద్దేశం. అడుగడుగునా ఈ ధ్యానం ఉండాలంటారు. మెలుకువలో - నిద్రలో - నడకలో - సంభాషణలో - కూర్చోవటంలో - నిలబడటంలో - ఆలోచనలో - అన్నిరకాల శారీరక - మానసిక - బుద్ధి పూర్వక చర్యలన్నింటిలో ఈ నిరంతర ధ్యానం - సాక్షీభావం - awareness ఉండాలంటారు. ఈ ధ్యానం నిరంతరం మండుతూ - ప్రకాశిస్తూ ఉండాలని చెబుతారు.

నేనీ మార్గంలో యథాశక్తిగా ప్రయాణం చేస్తున్నాను. నాకిప్పుడే ధ్యానంలోని సత్యం అవగతమవుతున్నది. నిజంగానే, మనం మనసు బంధం నుండి ముక్తులం కావటానికి ఇదొక్కటే సరి అయిన మార్గం. ముక్తులం కావటమంటే, ఎప్పుడో భవిష్యత్తులో కాదు. ఈ క్షణంలోనే ముక్తులం కావాలి. ప్రతీక్షణం ముక్తులమై జీవించాలి.

గతక్షణం విస్మరణకు రావాలి. ఈ క్షణం మరల పుట్టాలి. ప్రతీక్షణం నూతనంగా పుడుతూ, గతక్షణానికి గతిస్తూఉంటే, మనం నిత్యముక్తులమై జీవిస్తాం.

నేను జె.కె. ద్వారా నేర్చుకున్న జీవన సత్యం ఇది.

శ్రీ రఘుపతిరావుగారు ఈ పుస్తకంలో కృష్ణమూర్తి చెప్పిన సత్యాలను గురించి వివిధ కోణాల్లో వివరించే ప్రయత్నం చేసి, సఫలీకృతులయ్యారు. ఈ వ్యాసాలను పరిష్కరించే, ఎడిట్ చేసే అదృష్టాన్ని వారు నాకిచ్చి, నన్ను ధన్యులను చేశారు. శ్రీరఘుపతిరావుగారి కృషిని అభినందిస్తూ, వారినుండి ఇలాంటి గంభీరమైన వ్యాసాలు మరిన్ని రావాలని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

25-08-2003

పాలకొల్లు, ప.గో. - స్వామి అచలానంద సరస్వతి

## సమానార్థాలు

| | |
|---|---|
| అనుభవం | : Experience (past) |
| అనుభూతము | : Experienced (past) |
| అనుభూతి | : Experiencing (present) |
| తెలివి లేక ప్రజ్ఞ | : Intelligence |
| బుద్ధి (మేధస్సు) | : Intellect |
| అవగాహన | : Understanding |
| అసాధారణమైన | : Extraordinary |
| పరిశీలన, పరికించుట | : Observation |
| సంవేదన | : Sensation |
| మతపరమైన మనసు | : Religious mind |
| అన్యత్వం | : Otherness, blessed ness |
| పరివర్తన | : Transformation |
| మౌళికమైన మార్పు | : Radical change |

# 1. జీవనతత్త్వదర్శి జిడ్డు కృష్ణమూర్తి

మహోన్నత భావగుణ లక్షణలక్షితుడైన పరిపూర్ణ మానవతా మూర్తి జిడ్డుకృష్ణమూర్తి. నిశిత పరిశీలన, సూక్ష్మావగాహనల సమ్మేళనమే అతని జీవితం. సంపూర్ణ స్వేచ్ఛ అతని వికాసానికి ఊపిరి. సమస్త మానసిక నిబద్ధతకు లోనుగాకుండడమే ఆ స్వేచ్ఛకు జీవం. అతనిలో మేధాసంపత్తి, విశాల హృదయం సమపాళ్లలో వృద్ధి చెందాయి. అందుచే సామాన్య వ్యక్తిగా జన్మించి, విశ్వమానవుడుగా జీవించాడు.

కృష్ణమూర్తి అష్టమ గర్భ సంజాతుడు. 1895మే నెల 12వ తేది మొదటి ముప్పది నిమిషాలకు స్వగృహ పూజా మందిరంలో పుట్టాడు. స్వగ్రామం మదనపల్లె. చిత్తూరు జిల్లా. తల్లి సంజీవమ్మ, తండ్రి నారాయణయ్య. తండ్రి 1907లో మేజిస్ట్రేట్‌గా ఉద్యోగ విరమణ చేశాడు. తల్లి అతని 10వ ఏట చనిపోయింది. ప్రాథమిక విద్య అనంతపురం జిల్లా కదిరిలోను, మదనపల్లెలోను అభ్యసించాడు.

విశ్రాంత జీవితాన్ని దివ్యజ్ఞాన సమాజ సేవలో గడపడానికి నారాయణయ్య నల్గురు కుమారులతో అడయారు వెళ్లాడు. అచట ఆసంస్థ ఆంతరంగిక విభాగంలో సహాయ కార్యదర్శిగా చేరాడు.

కృష్ణమూర్తి, తమ్ముడైన నిత్యానందతో అడయారు కడలి ఒడ్డున ఆడుకొను చుండగా ఆంగ్లేయుడైన అతీంద్రియ జ్ఞాని లెడ్‌బీటర్ చూశాడు. అతని ముఖవర్చస్సు ఆకర్షించింది. కృష్ణమూర్తిలో జగద్గురువు కాగల విశ్వమానవ లక్షణాలున్నవని గుర్తించాడు. మైత్రేయ ప్రభువు ప్రవేశించ డానికి అతని దేహం అనువైనదని భావించాడు. అతనికి ఆల్కియోన్ (కృత్తికా కాంతిపుంజం) అని నామకరణం చేశాడు. లెడ్ బీటర్ ప్రోద్బలం వల్ల ఆనిబెసెంట్ (అధ్యక్షురాలు) ఆ బిడ్డల నిద్దరిని దత్తత తీసికొంది. వారికి ఇంగ్లాండులో ప్రత్యేక విద్యా శిక్షణ ఇప్పించింది. ఆమె ప్రేమాదరాభి మానములు వాళ్లకు పుష్కలంగా లభించాయి.

ఇండియా వైశ్రాయి అయిన లిట్టన్ దొరకూతురు, ఢిల్లీ ఆర్కిటెక్ట్ అయిన ఎడ్విన్ లుట్‌న్స్ ఇల్లాలు, సమాజ సభ్యురాలు అయిన లేడియెమిలి కృష్ణమూర్తికి అత్యంత అభిమానురాలయింది. బాలకృష్ణునియశోదలాలించి పోషించినట్లు, కృష్ణను యెమిలి ఆదరించి సేవించింది. నిర్మల హృదయులయిన స్త్రీ పురుషు లెల్లరిలోనూ, వారి కుటుంబ సభ్యులందరిలోను కృష్ణ ప్రేమపాత్రంగా కలిసి పోయేవాడు.

నిత్యానందమీద కృష్ణ ఎక్కువగా ఆధారపడేవాడు. ఇరువురూపడుగు పేకల్లాగ కలిసిపోయారు. నిత్య, విద్యలో చురుకుగా వుండి లండన్ మెట్రిక్ పరీక్షలు పాసయి లాలో చేరాడు. కృష్ణ మెట్రిక్ పరీక్షలు ముమ్మారు తప్పాడు. బెసెంట్ సలహాపై పారిస్ వెళ్లి ఫ్రెంచి భాష నేర్చుకోవడం మొదలు పెట్టాడు.. ఇంతలో నిత్యకు క్షయవ్యాధి వచ్చింది.

కొంత కాలం తర్వాత, వాళ్ళు క్షయ వ్యాధి నివారణార్థం సమశీతోష్ణ వాతావరణం గల కాలిఫోర్నియాలో గల ఓహైలోయలో స్థిరపడ్డారు. అది 1500 అడుగల ఎత్తున ఆహ్లాదకర వాతావరణంలో అనాస తోటల నడుమ పర్వత శ్రేణులచే పరివేష్టితమైనవున్న రమణీయ ప్రదేశం. లాస్ ఏంజల్సుకు 80 మైళ్ళ దూరంలో వుత్తరంగా వుంది. కృష్ణ, ధ్యానాదులు చేసుకుంటూ, తమ్ముని సేవిస్తూ ప్రశాంతంగా కాలం గడుపుచుండేవాడు.

కృష్ణకు ఓహైలో 1922లో ఒక విధమైన అనుభూతులు మొదలైనాయి. వెన్నెముక, మెడ, తల తీవ్రమైన వేదనకు గురి అయినాయి. కలవరించడం సేవచేస్తున్న వారిని తాకవద్దని నెట్టివేయడం, "అమ్మా' అని అరవడం చేసేవాడు. మూడవరోజు (ఆగష్టు 17) ఆ వేదనా ప్రక్రియ తీవ్రమైంది. ఎదురుగా వున్న పెప్పర్ వృక్షం క్రిందికి వెళ్లి కూర్చున్నాడు. పద్మాసనాశీనుడయ్యాడు. అపస్మారకంగా వున్నాడు. మాటపెలకడం లేదు. ఓపిక తెచ్చుకొని ఆరాధనా శ్లోకాలు వల్లించి మౌనం వహించాడు. ఏవో అనుభూతులు చెందాడు. మెల్లగా, మెలమెల్లగా సవ్వడి లేకుండా ముందుకు అడుగువేస్తుశాడు. "అడుగో, వస్తున్నాడు ధవళకాంతితో వస్తున్నాడు. మీరు చూశారా! అతడు బుద్ధుడు, బుద్ధుడు'' అని సేవచేస్తున్నరోజలాండ్ అరిచి కుర్చీలో కూలబడింది.

ఆరోజు కృష్ణమూర్తి పరివర్తన చెందాడు. ప్రేమ ప్రజ్వరిల్లింది. కరుణ స్ఫురించాడు. స్పందించే అగ్ని కణమైనాడు. అది వినూత్న అవగాహనా పరిణామం. ఆ ప్రక్రియ చాలా కాలంసాగింది. అది అపేక్షితం. అతనిలో నిశ్చలత, గాంభీర్య తేజస్సు, దీక్ష, విశాల దృక్పథం, శక్తి కొట్టవచ్చినట్లు పెరిగాయి. అప్పటినుండి అతడు 'కృష్ణజీ' అనిపిలవ బడ్డాడు. ఔహైలో రెండు భవనాలు, కొంత భూమి కొనుగోలు చేసి ఆర్యవిహారమని పేరు పెట్టి అచట నివాసం స్థిరంచేసుకున్నారు.

కృష్ణజీ ఇండియాకు ఓడలో ప్రయాణమై వస్తుండగా నిత్యానంద చనిపోయినట్లు వార్త విన్నాడు. ఖిన్నుడై పోయాడు. ఆవేదన చెందాడు. అంగలార్చాడు. ముల్గాడు, మొరపెట్టుకున్నాడు. పడక నుండి లేవలేదు. మౌనం వహించాడు. పది దినాల్లో పునరుత్తేజితు డయినాడు. ద్విగుణీ కృతశక్తివంతుడైనాడు స్థిరుడయ్యాడు. ఏకంగా దుఃఖవిముక్తుడయినాడు.

కృష్ణజీ సాంప్రదాయక విశ్వగురువు కాలేదు. విశ్వాసం, విధానం, సంస్థ, సత్య నిరూపణ చేయలేవన్నాడు. బెసెంట్, లెడ్ బీటర్లు నిర్ఘాంత పోయారు. పద్దెనిమిది సంవత్సరాలు తనను ఫెంచి పెద్దజేసి ప్రచారం చేసిన తారా సంస్థను ఆనిబెసెంట్ సమక్షంలోనే ఒమ్మెన్ (హాలెండ్) సభలో (1927 ఆగస్టు 3వ) రద్దుచేశాడు. కోట్ల విలువగల ఆస్తి పాస్తులను దాతలకు తిరిగి ఇచ్చాడు. దివ్యజ్ఞాన సమాజ సభ్యత్వానికి రాజీనామా చేశాడు. అన్ని బంధనాలనుండీ, సంస్థల నుండీ విశ్వాసాలనుండి, నిబద్ధతల నుండీ వైతొలిగాడు. సర్వస్వతంత్రుడైనాడు. "నేను మార్పు చెందాను, నామిత్రుల జీవితాలలో మార్పు తెస్తాను. ప్రపంచ పురోగతికి సాయపడతాను. నా అంతరంగ మంతాశక్తితో నిండిపోయింది. ఆనంద సామ్రాజ్యాన్ని చూపిస్తాను. జీవితాంతం బోధిస్తాను". అని ప్రకటించాడు. విశ్వమానవుడిగా వ్యవహరించాడు.

కృష్ణజీ ప్రపంచ పర్యటనలు చేస్తూ ప్రవచనాలు చేశాడు. యదునందన్ ప్రసాద్, రాజగోపాల్, ఎలైన్ నాయిడు, మేరీజింబాలిస్టు మున్నగువారు వ్యక్తిగత కార్యదర్శులుగా పనిచేశారు. మానవ స్వభావంలో మౌలికమైన మార్పును ఆకాక్షించాడు. అట్టి మనస్తత్వం బాల్యం నుండి కలగాలన్నాడు. అందులకై ఋషీవ్యాలి, రాజఘాట్ (కాశి), బొంబాయి, బెంగుళూరు, బ్రాగ్‌వుడ్ పార్క్ (ఇంగ్లాండు), ఓహై (కాలిఫోర్నియా) మొదలగుచోట్ల ఫౌండేషన్ తరపున పాఠశాలలు నెలకొల్పాడు. వివిధ ఫౌండేషన్లద్వారా అనేక గ్రంథాలు ప్రవచనాత్మకమైనవి వెలువడ్డాయి.

ప్రియమిత్రుడు రాజగోపాల్‌తో వచ్చిన పుస్తక సంస్థ తగాదాలో చాలా ఔదార్యంతోను, ప్రేమతోను, నిర్వైరంగా, నిశ్చలంగా ఆరేళ్లపాటు వ్యవహరించాడు. సమస్యలో గూడ సమభావం చూపాడు.

కృష్ణమూర్తిలో బుద్ధుని శోభాయమాన ప్రబోధం, అందం, ఆనందం, యదార్థం, సజీవ వ్యక్తిత్వం, అమృతతత్వం, ఆకర్షణ, పవిత్రత, సౌందర్యం, పరిపూర్ణ మానవత్వం,

ప్రేమౌన్నత్యం వున్నాయి అని ప్రపంచ మేధావులు వేనోళ్ల పొగిడారు. ఏకాంతంగా నడిచే ఋషి సత్తమునిగా, అధునాతన తాత్త్వికోన్నతునిగా, ఆంతరంగిక విప్లవ కారునిగా విద్యావైతాళికునిగా కృష్ణమూర్తిని లోకం గుర్తించింది.

కుల, మత, జాతి, వర్ణ, వర్గ, గురు, దైవ, శాస్త్ర, సంప్రదాయ, దేశ బద్ధమైనదంతా బంధమేనన్నాడు. గమనిక పరిశీలన అవగాహన ఎఱుక బాధ్యత సత్యం ప్రేమ నిస్వార్థం, సంపూర్ణ మానవతా వికాసానికి పట్టుగొమ్మలని నిరూపించాడు. స్వేచ్ఛ, ధీశక్తి, హృదయ వికాసం - పిల్లల్లో పెంపొందాలని చెప్పాడు. మానవాళికి కృష్ణమూర్తి చూపిన నిత్యనవ్యతను నిరాచ్ఛాదిత మనస్సుతో గ్రహించాలి.

"సత్యానికి మార్గముంటూలేదు. ఏ మార్గం ద్వారాగాని ఏ మతం ద్వారా గాని, ఏశాఖ ద్వారా గాని సత్యాన్ని పొందలేరు. నేను పూర్తిగ దీనికి కట్టుబడి వున్నాను. సత్యం హద్దులకు నిబద్ధతకు లోనుకానిది. అది సంస్థాగతం కారాదు, ఒక ప్రత్యేక పంథాను బట్టి పొమ్మని ఏ ఒక్క సంఘమూ ప్రజల్ని వత్తిడి చేయరాదు. ఇది గ్రహిస్తే ఒకనమ్మకాన్ని సంస్థపరం చేయడం అసాధ్యమని తెలుస్తుంది. విశ్వాసం కేవలం వ్యక్తి గతమైంది. దాన్ని మీరు సంస్థాగతం చేయలేరు. చేయరాదు. చేస్తే అది శవసదృశ మౌతుంది. ఘనీభవిస్తుంది. అంతేగాక అది ఒక విభాగమో ఒక శాఖో, ఒక మతమో అయితీరుతుంది. దాన్ని ఇతరుల నెత్తిమీద రుద్దాల్సి వస్తుంది" అని తారాసంస్థను రద్దుచేస్తూ ప్రకట చేశాడు.

కృష్ణజీకి కాలేయంలో క్యాన్సర్ గడ్డ వున్నట్లు చివరలో కనుగొన్నారు, అయినా సచేతనంగా వున్నాడు. చివరి రోజున ఓ హై కాటేజి సమీపంలో పెప్పర్ వృక్షం క్రింద పద్మాసనా సీనుడై ధ్యానం వహించాడు. ప్రకృతి తాదాత్మ్యం చెందాడు. కొద్దిగా పచారు చేశాడు. ఆరాత్రి 8 1/2 గం॥కు నిద్రపోయినాడు. అర్థ రాత్రి దాటగానే దేహత్యాగం చేశాడు. చిరునవ్వు సాక్షాత్కరించింది. నిత్యుడు నిద్రలోకి జారాడు. నిద్రసుషుప్తి నిచ్చింది. సుషుప్తి నిశ్చలత నొందించింది. అది 1986 ఫిబ్రవరి 17.

"ఇది నా అంతిమ సందర్శనం. నన్నొక దైవాంశ సంభూతుని చేయవద్దు. నాకెవరూ భక్తులు లేరు. నాకు స్మారక మందిరాలు, దేవాలయాలు వద్దు. తత్ భిన్నంగా చేస్తే నా బోధనలు వృథా అవుతాయి" అని కృష్ణజీ కన్ను మూయుటకు ముందే చెప్పాడు. జీవితంలో ఎల్లప్పుడూ పరిశుభ్రంగా వున్న తనదేహాన్ని

మరణానంతరం స్నానం చేయించి సామాన్య శుభ్ర వస్త్రంతో చుట్టి, కట్టె లాగ అగ్నికి ఆహుతి చేయమన్నాడు. ప్రార్థనలు, ఆరాధనలు, ప్రసంగాలు ప్రజా దర్శనాలు వలదన్నాడు.

అట్లే కాలిఫోర్నియాలో విద్యుద్దహన సాధనంతో దహన ఘట్టం ఒక్క మెరుపులో పూర్తి అయింది.

మొత్తం 90 సంవత్సరాల 9 నెలల 5 రోజుల్లో 70 ఏండ్లు నిరాఘాటంగా ప్రతి సంవత్సరం ప్రపంచాన్ని చుట్టి బహుదూరం పర్యటించి బహుజనాళిలో అరమరికలులేని ప్రేమ పంచుకొని వృద్ధాప్యం చివరి వరకు జగత్ సేవలో ప్రపంచ బోధకుడుగా జీవించిన ప్రప్రథమ వ్యక్తి ఇతడే!

ఏకాకి కాదతడు ఏకాంతుడు

చీకట్ల లోకాన వెలుగాతడు!

## 2.సంతత త్యాగమూర్తి కృష్ణమూర్తి

తారా పరిషత్తును రద్దు పరచడం గూర్చి ఈ నాటి ఉదయం మనం చర్చిస్తున్నాం. ఇది కొందరి కాహ్లాదం, కొందరికి విషాదం కల్గించవచ్చు. పరిషత్తును రద్దు పరచక తప్పదు ....

“సత్యం పంథాలేని ప్రదేశం. ఏ మార్గం ద్వారా గాని, ఏ మతం ద్వారాగానీ, ఏ శాఖ ద్వారా గానీ సత్యాన్ని పొందలేరు. ఇది నా అభిప్రాయం. నేను దీనికి పూర్తిగా కట్టుబడి ఉన్నాను”

“సత్యం మార్గం ద్వారా చేరరానిది. హద్దులకు, నిబద్ధతలకు లోను కానిది. కాబట్టి అది సంస్థాగతం కారాదు. ఒక ప్రత్యేక పంథాను బట్టి పొమ్మని ఏ ఒక్క సంఘమూ ప్రజలను వత్తిడి చేయరాదు. ఇది గ్రహిస్తే ఒక నమ్మకాన్ని సంఘపరం చేయడం అసాధ్యమని తేలుతుంది”.

“విశ్వాసం కేవలం వ్యక్తిగతమైనది. దాన్ని మిరు సంస్థాగతం చేయలేరు,

చేయరాదు. చేస్తే అది శవప్రాయ మవుతుంది. ఘనీభవిస్తుంది. అంతేగాక, అది ఒక విభాగమో, ఒక శాఖో, ఒక మతమో అయి తీరుతుంది. అది ఇతరుల నెత్తిన రుద్దబడుతుంది.''

అలా అనర్గళంగా సాగిపోతున్నది అతని ప్రసంగం. శ్రోతలు - సభ్యులు నిశ్చేష్టులైపోతున్నారు. నివ్వెరబోతున్నారు. కొందరు ఒకరి ముఖాలు ఒకరు క్షణం పాటుచూసు కున్నారు. అయితే శ్రద్ధగానే వింటున్నారు.

"ప్రపంచమంతటా ప్రతి ఒక్కరూ వ్యక్తిగత అభిప్రాయాన్ని ఇతరులపై రుద్దడానికే ప్రయత్నిస్తున్నారు. అసంతృప్తి చెందిన వారిని, బలహీనుల్ని ఆకట్టు కోడానికై సత్యాన్ని సంకుచితం చేసి, దానిని సాధనగా వాడుకొంటున్నారు...

"సత్యాన్ని దిగజార్చలేరు. సత్యాన్ని అధిరోహించడానికి వ్యక్తి కృషి చేయాలి. గిరి శిఖరాన్ని లోయలోకి ఈడ్చుకు రాలేం కదా! ఈసంస్థ రద్దు చేయడానికి ఇది ముఖ్యకారణం...'' సభికుల గుండెలు గుబేలుమన్నాయి.

"సత్య సాధనకు ఒక సంస్థ స్థాపిస్తే, అది బంధం అవుతుంది. వ్యక్తిని కుంగదీస్తుంది. అది వికాసానికి అవరోధమవుతుంది. తన్నుతా దెలిసికోవడానికి, పూర్తి సత్యాన్ని గ్రహించడానికి అది అడ్డు తగుల్తుంది. కాబట్టి నేనీ సంస్థను రద్దు చేయాలన్న నిర్ణయానికి వచ్చాను.

"ఇది ఘనకార్యమేమీ కాదు. నా కెవరూ అనుయాయులు లేరు. ఆ అవసరం కూడా లేదు. వ్యక్తిని అనుసరించడం మొదలు పెట్టగానే సత్యానుసరణం ఆగిపోతుంది. నా మాటలు మీరు విన్నా, వినకున్నా ప్రపంచంలో నేను చేయదలచిన దాన్ని ఖచ్చితంగా చేస్తాను. మనిషికి స్వేచ్ఛ నివ్వడమే నా ధ్యేయం. అదే ముఖ్యం. అన్ని సంబంధాల నుండీ అన్ని లక్ష్యాల నుండీ మనిషిని విడుదల చేయాలి....''

"వేలాది సభ్యులున్న సంఘాన్ని ఉన్నఫళానా రద్దు చేయడం నిజంగా ఎంతో గొప్ప ఘనకార్యమని ఒక విలేకరి అనుకున్నాడు. కాని అతనికి ఒక అనుమానం కల్గింది. "ఆ తర్వాత మీరేం చేస్తారు, ఎలా బ్రతుకుతారు? మీకెనరూ అనుయాయు లుండరు కదా, ప్రజలు ఎవరు వినరు కదా?'' అని అడిగాడు.

"క్రొత్తదనమంటేగిట్టక, పాతదనాన్ని వలక క్రుళ్ళి కృశించే వారికన్నా, లోపల

పక్షపాత వైఖరితో, వ్యతిరేకమైన అభిప్రాయాలతో నిండియుండి, పైకి మాత్రం సువాసనలను వెదజల్లే వారికన్నా, ఆవగింజంతైనా అవగాహన లేని వారికన్నా, ఇలాంటి వేలాది మందికన్నా, నిజంగా వినేవారు, అలా జీవించేవారు, నిత్యమైన దానివైపు మరిలేవారు, అలాంటి వారు ఒక్క ఐదారుమందున్నా చాలు; అసూయా పరులు వేలాది మంది ఉన్నా లాభం సున్న సుమా." అని జావాబిచ్చాడు.

"నేను సర్వస్వతంత్రుణ్ణి, సత్యపూర్ణుడను. కాబట్టి, నన్నట్లే అర్థం చేసికొని, మీరుకూడ స్వేచ్ఛ పొందాలని కోరుతున్నాను. నా ద్వారా మతం పేర ఒక గుంపును తయారు చేసిదాన్ని అనుసరించవద్దని కోరుతున్నాను. మత, ఆధ్యాత్మిక, జీవన్మరణాలనే అన్ని రకాల భయాల నుండి విముక్తి పొందండి... స్వేచ్ఛ నివ్వడమే ఆనంద ప్రదమని నేను తలుస్తున్నాను. ఇతరుల నుండి మాత్రం నేనేమీ ఆశించడంలేదు." ఇలా భావప్రసారం గంభీరంగా సాగిపోతోంది. అది వింటున్న వారు స్పందిస్తున్నారు.

"మీరు అధికారానికి దాస్యం చేయడానికి అలవాటుపడ్డారు. అది ఆధ్యాత్మికం వైపుకు దారితీస్తుందని మీరనుకుంటున్నారు. తమ మహిమతో, అద్భుత శక్తితో మిమ్ములనెవరో శాశ్వత స్వేచ్ఛ అనే సుఖ రూప స్వర్గానికి చేరుస్తారని మీరాశిస్తున్నారు. ఒకరి అధికారానికి లొంగి ఉండటంలోనే మీ జీవిత లక్ష్యమంతా ఆధారపడి ఉంది.

"మనుష్యులు స్వచ్ఛందంగా స్వేచ్ఛనొందేటట్లు చేయడమే నాపని. ఒకరి అంతరంగం స్వతంత్రంగా వుండడమే ఆధ్యాత్మికత. అది శాశ్వతమైంది. అది హేతు ప్రేమల సంలీనం. అది పరిపూర్ణసత్యం. అదే జీవితం... ఆకాశంలోని పక్షిలాగ స్వేచ్ఛనొందాలి ... ఎవరిని గురించి పదునైనిమిదేండ్లు పాటు పడ్డారో అతనే ఈ బంధాల నుండి విడుదల కమ్మని మీకు చెప్తున్నాడు. దానికి ఆధ్యాత్మిక విశ్వాసంపై ఆధారపడ్డ సంఘం అవసరం లేదు..."

"సంస్థలు మిమ్ములను స్వతంత్రులను జేయలేవు. బయటి మనిషి. సంస్థాగత ఆరాధన గాని, కారణాత్మక ఆత్మాహుతిగాని, కూటమిగా చేరడం గాని స్వేచ్ఛన్విదు.

"స్వర్గరాజ్యపు తాళపు చెవి ఏ కొద్ది మంది చేతుల్లోనే వుందనే అభిప్రాయం మీకు ఉంది. ఎవరి చేతిలోనూ లేదు. అందుకెవరికీ అధికారం లేదు. అది మీచేతిలోనే

వుంది. మీ అంతర్గత పవిత్రతపై, స్వచ్ఛతపై ఆధారపడి ఉంది. అదే స్వర్గరాజ్యం... మీరాశించే సహాయం, హాయి, సౌఖ్యం, శక్తి మీలోనే పొందగలరు...''

'నేను తారా పరిషత్తుకు అధ్యక్షుణ్ణి ఆ అధికారంతోనే నేనిప్పుడు దీనిని రద్దు చేయడానికి నిర్ణయం తీసుకున్నాను''. ఆ నిర్ణయం విని అక్కడున్న వారంతా అవాక్కైపోయారు. తమలో తాము వితర్కించు కొంటూ లేచారు. ఈ సమావేశం 1929 ఆగస్టు 3వ తేదీన ఆమెన్ (హాలెండ్)లో జరిగింది. పై తీర్మానం అమలు చేయబడింది. తక్షణమే ప్రాగ్దిక్తారా పరిషత్తు రద్దయింది. అదంతా నేరుగా అనిబెసెంట్ సమక్షంలోనే జరిగింది. సమావేశంలో ముందు వరుసలోన్న వారిలో ఆమె ముఖ్యురాలు.

ఆవక్త మరెవరో కాదు. సాక్షాత్తు అనిబిసెంట్ దత్తపుత్రుడు. అతన్ని మోషేలాంటి ప్రవక్తగానో, యేసు క్రీస్తులాంటి దేవుని కుమారుని గానో, యశోదకృష్ణుని లాంటి అవతారమూర్తిగానో తీర్చిదిద్దాలని ఆమె చిరకాలంగా ఆశిస్తూ వచ్చింది.

అలాంటి ప్రపంచబోధకుని రాకకై ముందుగనే (1911) ఆమె ప్రాగ్దిక్తారా పరిషత్ అనే అంతర్జాతీయ సంస్థను నెలకొల్పింది. ఆ పదహారేళ్ళ యువకుడిని దానికి అధిపతిగా చేసింది. విస్తృతంగా ప్రచారం చేయించింది. క్రమంగా దానిలో సుమారు 3000 మంది సభ్యులు చేరారు. అంత పెద్ద పరిషత్తు ఇప్పుడు ఒక్కమాటలో హఠాత్తుగా బ్రద్దలైంది. మిలియన్ల విలువ గల ఆస్తులు దాతలకు తిరిగి ఇవ్వబడ్డాయి. అనిబిసెంట్ హతాశురాలైంది. అయినా సత్యాన్ని బంధించే నిర్బంధ సంఘాలు, సంస్థలు నిరర్థకమన్నారు. కొన్నిటిని రద్దుచేశారు. కొన్నిటి నుండి వైతొలిగారు. వాటినుండి విముక్తులు కావడానికి ఏమాత్రం వెనుకాడలేదు. క్రొత్తవి తగిలించుకోలేదు.

(కృష్ణమూర్తి శతజయింతికి 'సద్గురువాణి'లో ప్రకటితమైంది.) జూలై 1995

# 3. తత్త్వాలకు తలమానికం కృష్ణమూర్తి తత్త్వం

పాశ్చాత్య దేశాలలో సోక్రటీస్, ప్లేటో దగ్గర నుంచి మార్క్స్ వరకు గొప్ప గొప్ప తత్వవేత్తలు వెలిశారు. భారత దేశంలో తాత్విక చింతనతోనే వేద సాహిత్యం వెలువడింది. ఋషుల దగ్గర నుంచి బుద్ధుడు, త్రిమతా చార్యుల వరకు మహాతాత్వికులుద్భ వించారు. భారత దేశంలో పుట్టిన బిడ్డ కృష్ణమూర్తి అధునాతనంగా మహోన్నత తాత్వికుడుగా ప్రసిద్ది జెందాడు. కృష్ణమూర్తి తత్వం సమగ్రంగా ఉండడమేగాక,

వైవిధ్యంగా, మిగతా తత్వాలకు కొంతవేరుగా ఉండడం గమనించదగ్గది.

కృష్ణమూర్తి తత్వం మౌలికమైంది. ఎవరినీ అనుసరించింది గాదు. ఎవరినీ ఆదర్శంగా తీసుకున్నది గాదు. ఎవరితోనూ పోటీ పడింది కాదు. పోల్చి చూడరాదని కృష్ణమూర్తే చెప్పాడు. జీవితానికి సంబంధించిన అన్ని అంశాలను పరిగణన లోకి తీసుకున్నాడు. తన తత్త్వమేమిటో తన జీవితం ద్వారా బయలుపరిచాడు.

జీవితానికి కీలకమైనది మనస్సని గ్రహించాడు. మనోగతులను, మనస్సులోతులను అద్వితీయంగా అధ్యయనం చేశాడు. అత్యంత విశాలంగా, లోతుగా, ఔన్నత్యంగా మనసుపై పరిశోధనలు జేశాడు. మనసు ద్వారానే మౌలికమైన మార్పు రావాలన్నాడు. మనసులో విప్లవం చెలరేగాలన్నాడు. విప్లవం ద్వారా జీవితంలో మార్పురావాలన్నారు. అంతర్గత విప్లవం బహిర్గత సమాజం కాగలదని సూచించాడు. 'నీవే ప్రపంచానివి' అని నొక్కి చెప్పాడు. మనసుకు మించిన ఆత్మనూ, దైవాన్నీ ఆయన గుర్తించలేదు. ఏదైనా పరిశోదించి వాస్తవాన్ని తెలుసుకోమన్నాడు గానీ, నమ్మి పరిశోధించమనలేదు.

నమ్మవద్దని నిక్కచ్చిగా జెప్పినవాడు కృష్ణమూర్తి. 'నేను దేనినీ నమ్మను, వాస్తవం చూడ గల్గినపుడు నమ్మకంతో పనిలేదు' అని అన్నాడు. సూర్యోదయం వాస్తవమైంది. దానిని నమ్మవలసిన పనిలేదు. ఇదీ అతని వైఖరి. విశ్వాసం మతానికి సంబంధించిన పదజాలం. అది దైవానికి కూడ వర్తిస్తుంది. నమ్మకమే జీవాధారమని, నమ్మకం చుట్టూ ప్రపంచంలో పెద్ద పెద్ద వ్యవస్థలు సృష్టించారనేకులు. దాన్ని పూర్తిగా ఖండించాడు కృష్ణమూర్తి. "వాట్ ఈజ్" అనగా ఉన్నదేమిటో, ఉన్న స్థితి ఏమిటో - వాస్తవమేమిటో - యధార్థం ఏమిటో - సత్యం ఏమిటో గుర్తించమని కృష్ణమూర్తి చెప్పాడు. "వాట్ ఈజ్" అనేది సంపూర్ణంగా బయలైనపుడు, మనసున నిలిచినపుడు అవసర పరిణామ క్రియ దానతంటికదే జరుగుతుందంటాడు.

సత్యం మతాలలో లేదు, దేవాలయాలలో లేదు, పూజారాధనలలో లేదని బోధించాడు. ఉన్నదున్నట్లుగా లేనిది లేనట్లుగా గ్రహించడం సత్యం. దానికి ఒకచోటు, ఒక శాశ్వత స్థాయి అంటూ ఉంటే ఒకమార్గం, ఒక సాధన ఏర్పడతాయి. అది ఎక్కడికక్కడ, ఏక్షణానికి ఆక్షణం గ్రహించదగింది. అందుకే సత్యం మార్గంలేని క్షేత్రం అన్నాడు. ఫలాన చోటు అని నిర్ధారించబడి ఉంటేకదా దారి వేయడానికి. ఈ అవగాహన

వల్ల 'సత్యం' కొరకు ఏర్పడ్డ సిద్ధాంతాలు, సాధనలు, సంస్థలు - అన్నీ ఎగిరిపోయాయి. వాటి ఆవశ్యకత సత్యం నిమిత్తం కాదు, సత్యం ముసుగులో మరో దానికొరకని అర్థమవుతుంది. బయటికి చెప్పేధ్యేయ మొకటి, లోన పొందాలనుకొనే ఫలితమొకటి కాగానే వ్యక్తిలోను, సమాజంలోను భ్రమలు, మోసాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. సత్యం నిప్పులాంటి దైనపుడు, దాని చుట్టూ ఏమి అల్లినా దగ్ధమైపోతుంది.కాని నమ్మకం చుట్టూ ఏమైనా, ఎంతైనా నిర్మాణం చేయొచ్చు. అయినా వ్యవస్థీకృతమైన దేనియందును సత్యం నిలవదు.

ఆలోచన (థాట్) గురించి కృష్ణమూర్తి శోధించి నంతలోతుగా, స్పష్టంగా మరెక్కడా జరగలేదేమో! ఆలోచన యొక్క పరిధిలు గ్రహించారు. మనసుకు సంబంధించిన ఆలోచన ఉంది; అది సైకోలాజికల్. భౌతిక విషయాలు గురించి ఆలోచన ఉంది, అది సైన్టిఫిక్. సైన్సు క్రమానుగతంగా ఉంటుంది. ఒక దాన్ననుసరించి మరొకటి వస్తుంది. అది మరిచి పోవలసింది కాదు. మానసిసమైన దానికి ఏక్షణానికి ఆక్షణంలోనే విలవ. మరుక్షణానికి మోసుకెళ్లతగింది కాదు. దేహానికి తగిలిన గాయం కొద్దిరోజులుంటుంది. మనసుకు తగిలిన గాయం మరచిపోతగింది. ఇంటికి వేళ్లేదారిని మరిచిపోగూడదు. అవమానం మరిచిపోతగ్గది. ఇక్కడ ఆలోచన అంటే కాలం. అందుచే ఆలోచన వర్తమానానికి అవరోధం, హానికరం. ఆలోచన ఆలోచించే వానినే వంచిస్తుంది. సత్యం వర్తమానానికి చెందింది. ఆలోచనకు చెందిందిగాదు. కనుక సత్యం ఆలోచనకు పూర్తిగా అందదు. అందినట్లు భ్రమగొల్పుతుంది.

జ్ఞానమంటే ఏమిటి అని ప్రశ్నించాడు కృష్ణమూర్తి. ఒక స్పష్టత నిచ్చాడు. జరగుచున్న తీరునుబట్టి స్మృతిలో ఉన్నది జ్ఞానం. సంఘటన - అనుభూతి - స్మృతి -జ్ఞానం - ఆలోచన - ఇదీ నడిచే క్రమం. కనుక జ్ఞానమంటే జ్ఞాపకం, సమాచార సేకరణ,ఆలోచనకు ఆధారం. అదీ గతమే అవుతుంది. ఇది అర్థమయినపుడు జ్ఞానం ఆరాధనీయం కాదు. అగ్నిలా కర్మలను దగ్ధం చేయలేదు. వర్తమానంలో కావలసింది అవగాహన. దాన్ని తెలివి లేక ప్రజ్ఞ అనవచ్చు. గతానికి సంబంధించిన జ్ఞానాన్ని, శాస్త్రాలకు సంబంధించిన సమాచారాన్ని నిల్వచేసుకొనే గురువుల నుంచీ, పండితుల నుంచీ సత్యం గోచరించదు.

మూఢ విశ్వాసాలను, మూఢాచారాలను, తిరస్కరించడమే గాక కృష్ణమూర్తి మతాలను, ఆధ్యాత్మికాధికార సంస్థలను మొత్తంగా కాదన్నాడు. మానసికంగా విభజించే

కులాన్ని, జాతీయతను మౌలికంగా మార్చివేశాడు. మనిషి వేసుకొన్న అదనపు ముసుగులన్నిటిని తొలగించమన్నాడు. వ్యక్తి మార్పు నుంచి సమష్టి మార్పువరకు కులరహిత సమాజానికి దారితీసే విప్లవ భూమికా ప్రతిపాదన జీవితం ద్వారా చూపించాడు.

ఏ సిద్ధాంతాన్నీ కృష్ణమూర్తి అంగీకరించలేదు. దానికి ఒకే ఒక ముఖ్య కారణముంది. సిద్ధాంతమనేది ఆదర్శమేగాని వాస్తవంకాదు. ఆదర్శం భవిష్యత్తుకు సంబంధించింది. అహింస అనేది ఆదర్శం. అంటే భవిష్యత్తులోనే అహింసగా ఉండాలనుకుంటాం! ఇపుడు హింసాత్మకంగా ఉన్నట్లేగదా! వర్తమానంలో అహింసతో ఉంటే అహింసగా ఉండాలననక్కర లేదుగదా! ముందెప్పుడో రాజ్యసుఖమో, సామూహిక సుఖమో, కమ్యూనిజమో అనుభవించడానికి ఇపుడు వ్యక్తిగతంగా గాని, సామూహికంగా గాని జీవితాలను సిద్ధాంతపరంగా హింసా మయం చేయడంలో అర్థమేలేదు గదా అంటాడు.

మానవ చైతన్యానికి స్వేచ్ఛ, అవగాహన, మార్పు, ధార్మిక జీవనం, నిత్య స్పందన, లోదృష్టి, విశాల భావన, స్వావలంబన, ప్రేమ, ప్రజ్ఞ మున్నగు జీవ గుణాలతో శోభిల్లాలని అనుభూతితో అనునిత్యం భాషించాడు కృష్ణమూర్తి. మదనపల్లెలో 1895 మే 12న పుట్టి అమెరికా ఓహై (కాలిఫోర్నియా)లో 1986 ఫిర్బవరి 17న కాలధర్మం చెందాడు. మార్పుచెందాక 60 ఏళ్ళకు పైబడి ఇండియా, సిలోన్, అమెరికా, ఆస్ట్రేలియా, ఐరోపా దేశాలలో అవిశ్రాంతంగా తిరిగి తిరిగి తాత్విక ప్రవచనాలు జేశాడు. వేలాది ఆడియోలు, వీడియోలు కల్తీ చెందకుండా, ప్రక్షిప్తాలు జొరబడకుండా, ప్రత్యక్ష సాక్ష్యాలుగా ఉన్నాయి. లోకమిపుడు వాటి విలువ బాగా గుర్తిస్తోంది. పిల్లలలో మార్పు తీసుకొని రావాలని నూతన పంథాలో ఇండియా, ఇంగ్లాండు, అమెరికా దేశాలలో చాలా పాఠశాలలు నెలకొల్పాడు. తనకు సభ్యత్వం, అధికారం లేని అనేక కృష్ణమూర్తి ఫౌండేషన్లు నెలకొల్పబడ్డాయి. వాటి పని పుస్తకాలు, టేపులు అందజేస్తూ, పాఠశాలలు నిర్వహిస్తూ, సమావేశాలు ఏర్పాటు చేయడం మాత్రమే. ఆధ్యాత్మిక అధికారం తనకు లేనట్లే తన పేరుతోఉన్న ఏ సంస్థకూ లేదు. తాను ఏసిద్ధాంతానికి, ఏశాఖకూ, ఏ ఇజానికి, ఏ క్యాటగరీకి, ఏముద్రకు చెందని మహామనీషి. కృష్ణమూర్తి మానవతామూర్తి, తాత్విక యుగ చక్రవర్తి. జన్మదినాలు చేసుకోని ధన్యజీవికి ఈ వ్యాసరూపకమైన హార్దిక నివాళి!

# 4. కృష్ణమూర్తి వినూత్న ఆవిష్కరణ

## మనసు స్థానం

### మనసును వదిలేశాం

సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంకేతిక క్షేత్రాలలో మనకు కొంతవరకు విజ్ఞానం, గౌరవం, అభివృద్ధి సాధించాం. అయితే ఈ క్షేత్రాలన్నిటికీ ప్రేరణ, మార్గదాత, ప్రభావం, మూలం అయిన మానసిక క్షేత్రాన్ని మనం పట్టించుకోవడం లేదు.

### మనసును మథించాలి

అన్ని ధర్మాలకు, అన్ని కర్మలకు, అన్ని చేతనా ప్రక్రియలకు, మానవ మనుగడకు మూలం మనసు. కృష్ణమూర్తి ఆ మనసును శోధించాడు, పరిశోధించాడు, విశ్లేషించాడు, పరిశీలించాడు, సాధించాడు, ఆవిష్కరించాడు. మానసిక శాస్త్రం (Psychology) గా మనముందు ఉంచాడని కాదు. మానవ జీవన మనుగడలో, ఉచ్ఛనీచ స్థితుల్లో దాని పనితనాన్ని, ధోరణులను, వ్యవహారాలను, భ్రమలను, అవసరానవసరాలను, పరిమితులను మొత్తం సశాస్త్రీయంగా, విజ్ఞానదాయకంగా జూపించాడు.

### కృష్ణజీ మనసు అంతు తేల్చాడు

మనసు గుట్టు రట్టులను, లోతుపాతులను అత్యద్భుతంగా నిరూపించాడు. దాని అవగాహన ననుసరించి మిగతా క్షేత్రాలన్నిటిని ఎలా ప్రభావితం చేసుకోవాలో, మలచుకోవాలో, ఉన్నత మానవ మనుగడకు వినియోగించుకోవాలో అరటిపండు ఒలిచి అరిచేతిలో పెట్టినట్లు చూపించాడు. తద్వారా మానవక్షేత్రాలన్నిటిని స్పృశించాడు; అంతేకాదు విప్లవీకరించాడు.

కృష్ణమూర్తి మార్క్స్ సిద్ధాంతం గూర్చి మాట్లాడుతూ, మార్పు రావలసింది ఇప్పుడు, ఇక్కడ, వర్తమానంలోనేకాని భవిష్యత్తులో కాదనే వాస్తవం తెల్చాడు.

### దైవం నీ స్వీయ సృజన

నేటి సామాజిక రుగ్మతలకు సమూలమైన పరిష్కారాలు కృష్ణమూర్తి జీవించడం ద్వారా చూపించాడు. మతం, కులం, జాతీయత, ఇతర మానసిక విభజనలన్నింటిని ఏకథాటిగా కొట్టి పారవేశాడు. దైవాన్ని నీవే నిర్మించుకొన్నావు తప్ప, ఏదీ దైవ నిర్మితం కాదనే సహేతుకతకు దర్పణమయ్యాడు.

### రాజకీయాలు -శాంతి

రాజకీయ నాయకులు చూపే పరిష్కారాల వల్ల, మేధావులు ఆలోచనా పరంగా చూపే పరిష్కారాలవల్ల సమస్యలు పూర్తిగా తొలగవని తేల్చాడు. పాత సమస్య స్థానంలో కొత్త సమస్య పుట్టుతోందని అన్నాడు. శాస్త్ర సాంకేతిక రంగంలో ఉలోచన చేసే అద్భుతాలను గుర్తిస్తూ, మానసిక రంగంలో ఆలోచన సృష్టించే విధ్వంసాన్ని ఋజువు జేశాడు. సంక్షేమం, శాంతి గురించి మాట్లాడే రాజకీయ నాయకుల ప్రయోజనాలు వేరైనవనీ, వాళ్ల శాంతి గురించి మాట్లాడకుండడం మంచిదని హెచ్చరించాడు. జాతీయత, దేశీయత పేరుతో హింసను, యుద్ధాలను సృష్టింస్తున్నారని వాపోయాడు.

### తక్షణ మార్పే కావాలి

ఇకపోతే ఉపనిషత్తులు ప్రతిపాదించే బ్రహ్మతత్త్వాన్ని అంగీకరించలేదు. శంకరుని అద్వైతాన్ని చిలక పలుకులతో సమానమన్నాడు. ఈ మతాలను, శాఖలను, ఆరాధనలను, సంస్థలను, సిద్ధాంతాలను, సంప్రదాయాలను, గతాన్ని, ధ్యాన ప్రక్రియలను, ఒక్కుమ్మడిగా తుడచిపెట్టివేశాడు. మనిషి మెదడులో రగుల వలసిన విప్లవజ్యోతి అవసరాన్ని పట్టి చూపించాడు. రాడికల్ ఛేంజ్ ప్రధానమైం దన్నాడు.

## కృష్ణతత్త్వం

### మార్పు - ఆవిష్కరణ

కృష్ణజీ చేసిందేమిటి, చెప్పిందేమిటి? ఆయన చేసిందే చెప్పాడు; చూసిందే చెప్పాడు. యుగయుగాల నుంచీ మనిషి ఇంచుమించు ఒకే మూసలో బ్రతుకుతున్నాడు. సర్దుబాటు చేసుకుంటున్నాడుగాని, సంపూర్ణమైన మార్పు చెందడం లేదు. అందుచే నిరంతర ఘర్షణ (Conflict) లో జీవిస్తున్నాడు. ప్రపంచాన్ని దుఃఖ భూయిష్టం చేశాడు. పూర్వం నుంచీ వస్తున్న తత్త్వవేత్తలందరి కంటే భిన్నంగా, సంపూర్ణంగా తనకు తాను మార్పు జెందాడు. ఆలోచన ఆగిపోయిన స్థితిలో, తనను తాను ఆవిష్కరించుకొన్నాడు.

### క్షణ క్షణపు ఎరుక

సహేతుకత, వాస్తవికత, అవిభాజ్యత, ప్రసన్నత, ప్రేమైక్యత ఆయన జీవితాన్ని పరమోత్కృష్టమొనర్చాయి. ఆవిధంగా మార్పు చెందటాన్ని ఒక విధానంగా గాక, క్షణ

క్షణం సత్యావిష్కరణతో, సజీవత్వంతో, స్పందనతో, వర్తమాన స్ఫూర్తితో, తిరుగులేని అవగాహనతో, స్వేచ్ఛతో తెలివితో, ప్రేమతో జీవించడమే విప్లవాత్మమైన మార్పు. మనసు యొక్క లోతులను, బాహ్య ప్రపంచంపై దాని ప్రభావాన్ని కృష్ణజీ తరచి లోతుగా జూసినంతగా మరెవ్వరూ చూడలేదంటే అతిశయోక్తి కాదు.

## సంబంధాలు

మానవ జీవన సంబంధమైన విషయాలే ఆయనకు ముఖ్యం. మానవ సంబంధాలన్నీ సరిగా ఉండమే సరైన జీవితం. మార్పు కోరే సమాజానికి ముఖ్యలక్షణం సంబంధాలను సరిచేసుకోవడం. ఊహల్లోను, కేవల మానసిక విషయాల్లోను, నమ్మకాల్లోను ఉన్న అవాస్తవికతను, అహేతుకతను ఎక్కడికక్కడ బట్టబయలు చేసి చూపాడు. విద్యార్థి దశనుండి రావలసిన మార్పు కొరకు తీవ్ర కృషిసల్పాడు.

## సత్యం దారిలేని స్థానం

సత్యం మార్గనిబద్ధత లేని స్థలమన్నాడు. దానికి అనేక రూపాలు, అనేక విధానాలు, అనేక సంఘాలు, శాఖలు, అభ్యాసాలు ఏర్పాటు చేయడం అనర్థ దాయకం. ఎవరికి వారే, ఏక్షణానికాక్షణమే సత్యాన్ని కనుగొనాలి. ఉన్నదున్నట్లు చూడడడం సత్యం. సత్యం శాశ్వతం కాదు, అశాశ్వతంకాదు. సజీవమైన, స్వచ్ఛంద మైన స్వేచ్ఛతో కూడిన మనసు మాత్రమే దాన్ని కనుగొన గలదు. మనిషిలో శక్తివుంది. దాన్ని సత్యాన్వేషణకే వినియోగించాలి. సత్యాన్ని కనిపెట్టడంలో ప్రేమ వుంది. ఆ ప్రేమం మానవ సంబంధంలో కొత్త నాగరికతను సృష్టిస్తుంది.

## నమ్మకం

నమ్మకం అనేది ఒక అభిప్రాయం. అభిప్రాయం నిజమెలా అవుతుంది. నమ్మకానికి స్థానం దేవునిలోను, మతంలోను పాతుకుపోయింది. నమ్మకం వేరు, వాస్తవం వేరు. నమ్మకం భ్రమలకు దారి తీస్తుంది. నమ్మకంతో చేసే పనులు గందరగోళం సృష్టిస్తున్నాయి. నమ్మకాన్ని వ్యక్తిగత పరిధికి పరిమితం చేస్తే మతంతో ప్రమేయంలేదు. నమ్మకం సత్యాన్ని కాదంటుంది, మనిషిని బంధిస్తుంది, దేవుణ్ణి కనుగొనలేదు, అసత్య ప్రచారంతో మిగిలిపోతుంది. మనకున్న ఒకే పరికరం మనసు లేక మెదడు. దానికి స్వేచ్ఛనివ్వాలి, పరిశీలనకు, పరిశోధనకు వినియో గించుకోవాలి.

### గతమే మనసు

మనసు గతంలో పనిచేస్తుంది, అన్నీ పోగుచేసుకొని, నిలవజేసుకొని, జ్ఞానం అని నామకరణం జేసి 'నేను' గా రూపు దిద్దుకొంటుంది. ఈ 'నేను' సత్యావగాహనకు అవరోధం, విభజనలకు మూలం, స్వార్థానికి ప్రేరణ, సంఘర్షణలకు పుట్టిల్లు, ఆలోచనలకు ఆటస్థలం. ఆలోచన కాల పరిమితం, అసంపూర్ణం. భౌతిక విషయాల్లో ఆలోచన అవసరం. మానసిక విషయాల్లో అది అనర్థం చేస్తుంది. మనసు సమస్యలకు చివరి పరిష్కారం కాదు, పైగా సమస్యలను సృష్టిస్తుందంటారు. మనసులో కొన్ని విలువలు, ఇచ్ఛ, తృష్ణ వగైరా చోటు చేసుకొని ఉంటాయి. ఆ సత్యం అవగతమైతే ఆలోచనలు ఆగిపోతాయి, మనసు ప్రశాంత మవుతుంది.

### మానసిక కాలం

గడియారం ప్రకారంగా గాక, మానసికంగా కాలం లేదంటారు కృష్ణజీ. కాలం లేదన్నపుడు మార్పుకు వాయిదా లేదు, సాధనతో పనిలేదు. జ్ఞాపకమే కాలం, ఏదో కావాలనుకోవడమే (Becoming) కాలం. అజ్ఞాని జ్ఞాని ఎలా అవుతాడు? అజ్ఞానం జ్ఞానమవడమంటే అజ్ఞానం పెరగడమే. ఆలోచన, కాలంలో, దేవుని సృష్టిస్తుంది. ఆలోచనేకాలం. అది మనసుచేసే పని. ఆలోచన ఆగితే కాలంలేదు, మనసు లేదు, వేరే గుణం ఏర్పడుతుంది. సంపూర్ణత, మార్పుసిద్ధిస్తాయి.

### జ్ఞానం కాదు అవగాహన అవసరం

జ్ఞానమంటే సమాచార సేకరణ. జ్ఞానం రక్షించలేదు. అవగాహన మార్పు తెస్తుంది. అవగాహన క్రియాత్మకం. అర్థం కావడమో కాకపోవడమో ఉంటుంది. రెండూ కలిసి ఉండవు. ఈ సత్యం తెలిస్తే సరళత్వం, నిజాయితీ వుంటాయి. తెలిసిందాని ద్వారా తెలియంది ఆవిష్కరణకాదు. జ్ఞానం భౌతిక స్థాయిలో ఉపయోగం, మరోస్థాయిలో హానికరం. జ్ఞానంవల్ల, జ్ఞానం స్థానంలో వివేకం వుండదు. సంపూర్ణ స్వేచ్ఛలో, ఖాళీలో వివేకం (wisdom) ఉంటుంది. మనిషికి తన స్థితిని తెల్పేది వివేకవంతమైన, మనసని కృష్ణజీ అంటారు. అది తాజా మనసు, ప్రేమకు సంబంధించింది. జీవితాంశాలను, జీవితాన్ని విభజించేది కాదు. విధానానికి, శిక్షణకు, నిబద్ధతకు లోనైంది కాదు. ఈ సత్యాన్ని గ్రహిస్తే హిందువని, ముస్లిమని, కమ్యూనిస్టని ఏ నమ్మకంలోనూ చిక్కుపడిపోవు. దానికి వాస్తవంతోనే పనికాని అభిప్రాయంతోకాదు.

సూక్ష్మ సంవేదనతో వుంటుంది.

## ఆదర్శం వాస్తవం కాదు

అహింసను గాని మరో ఆదర్శాన్ని గాని పెట్టుకొన్నవాడు హింసతోను, ఆ ఆదర్శానికి వేరుగాను వుంటాడు. ఎందుకంటే ఆదర్శమనేది భవిష్యత్తుకు చెందింది. ఇప్పుడు నీవేమిటి అనేది ప్రధానమంటారు. అహింస అనేది ఒక సంకల్పం (concept) మాత్రమే, అది వాస్తవంకాదు. అహింస అనే అభిప్రాయాన్ని సృష్టించి, ఆలోచన దానిపై స్వారీ చేస్తుంది. ఆదర్శం వేరే ప్రయోజనం కొరకే. "అవినీతితోను, హింసతోను కూడిన సమాజానికి మనం అలవాటుపడ్డాం. ఇది మనకు తెలుసు. చిన్నప్పటినుంచి మనం తెలిసో తెలియకో హింసతో, అనుకరణతో పోషింపబడ్డాం. బయట పడటం ఎలాగోతెలియదు. అది సాధ్యం కాదనుకొంటాం. హింసగా ఉండాల్సిందే అంటాం. చేతులకుతొడుగులు వేసుకొని హింస నెరపవచ్చు, మర్యాదగానే హింసించవచ్చు ఎన్నో విధాలున్నాయి" అన్నారు. మార్పు మనిషి మెదడులో రావాలంటారు. తద్వారా "తనకు, ఇతరులకు తాను వెలుగు కావాలి." మార్పు మనతో మొదలవ్వాలి. అందుకు గట్టి ఉద్దేశ ముండాలి. మనల్ని మనం అర్థంచేసుకొనే రీతిలో ఉండాలి. విప్లవం ద్వారా ఏదో కొద్ది సర్దుబాటుతో మార్పు తెస్తారని ఇతరులకు వదలరాదు. అది మన బాధ్యత అని హెచ్చరించారు. మానవ సంబంధంలో మార్పు రావాలి. కాని విప్లవకారులు సంస్కర్తలు ఒక ధ్యేయాన్ని మనసులో పెట్టుకొని దానికొరకు మనిషిని వాడుతున్నారు. వర్గపోరాటంతో వర్గరహిత సమాజం రాదు. మంచి ఫలితం నిమిత్తం చెడుమార్గం ఎంచుకోరాదు. యుద్ధానికి తయారు కావడంలో శాంతి లేదన్నారు. ఒకరినొకరు మానసికంగా వాడు కొన్నంత వరకు, దోపిడీ చేస్తున్న వరకు సరైన సంబంధ మెలా వుంటుంది? దోపిడీలో భయం, భ్రమ, దుఃఖం ఉన్నాయి, సంబంధంలో కాదు. సంబంధం అంటే కలిసిపోవడం. సాధించామనే సంతోషం నిమిత్తం ఇతరుని వాడుకోవడం సాగిస్తే ఘర్షణ, వ్యతిరేకత, శత్రుత్వం తప్పదన్నారు.

## ధ్యానమంటే సంపూర్ణ అవగాహన

ధ్యానమంటే దేహాన్ని గాని, మనసునుగాని కంట్రోలు చేయడంగాదు. అత్యంత అవగాహన, ప్రజ్ఞ ప్రేమల ఆవిష్కరణ ధ్యానమని కృష్ణజీ అభిభాషణ. మనసును పూర్తిగా డొల్ల జేయడం నిజమైన ధ్యానం ఆయన దృష్టిలో. ఖాళీలేకపోతే నూతనత్వమే

లేదు. పునరుక్తి, రాపిడి, ఇంద్రియోద్వేగాలు మనసును మొద్దుబారజేస్తాయి. ఏకాగ్రత ధ్యానం కాదు. అది కుంచింపజేస్తుంది. ఏకాగ్రతలో ఉన్న నిరోధతత్వం ఆసక్తిలోలేదు. మనసు యొక్క నిజమైన ఆసక్తి ఏమిటో తెలియాలి. మనసుకు ప్రసన్నత చేకూర్చేది ధ్యానం. సంవేదనతో ఆసక్తితో సూక్ష్మావగాహనతో ఉండడమంటే ప్రేమించడం. ఆలోచనతో కూడింది ప్రేమకాదు. "ఆలోచనల నుండి మనసుఖాళీ అయినపుడు, మనో విషయాలనుంచి హృదయం ఖాళీ చెందినపుడు ప్రేమ వుంటుంది."

### 70 ఏండ్ల ప్రబోధం

కృష్ణజీ జీవితానికి సంబధించిన అంశాలన్నిటిపట్ల సంపూర్ణ అవగాహన చెందియున్నారు. ఆయనకు ఊహలతో పనిలేదు. సంబంధమే జీవితం. ఆయన జీవితం సంపూర్ణం. 70 ఏళ్లు ప్రవచించారు. ప్రతి ఏట లక్షలాది మందికి చెప్పారు. దేశ దేశాలు తిరిగారు. కొత్త వరవడి పెట్టారు. ఆయన మానవునిలా, ఉన్నతునిలా, విశ్వజనునిలాగా జీవించారు. ఆయన్ని వర్గీకరించడానకి వీల్లేదు. ఎవరితోను పోల్చడానికి కుదరదు. ప్రపంచ బోధకులైనారు.

### కృష్ణజీ ఎలా అర్థమవుతారు?

కృష్ణమూర్తిని అర్థం చేసుకోవాలంటే ఆసక్తి ఉండాలి. మిగతావి అన్నీ ప్రక్కన పెట్టాలి. అంగీకరించడంగాని, నిరోధించడంగాని, ఏదీ సమర్థించడం గాని పనికిరాదు. మార్పుకు సిద్ధంకావాలి. కొత్తదనం నింపుకోవాలి. ఏకాంతంగా ఉన్నా సమాజ సంబంధాలలోనే మార్పుతేవాలి, వాటితో జీవించాలి. తాను మారందే సమాజం మారదని తెలియాలి.

## 5. కృష్ణమూర్తి అవగాహనలో ఔన్నత్యం

కృష్ణజీ తనకు అవగాహనైన విషయాన్ని మాత్రమే చెపుతారు. తన అనుభూతిని వ్యక్తంజేయడానికి ఒక విధమైన ఇబ్బందిని పడుతుంటారు. (ఇప్పటికీ ఆడియో వీడియోలలో జూడవచ్చు) అంతర్బాహ్య దృష్టులను కలుపుకొంటూ వాస్తవికతలను జూస్తారు. తాను చూసిందే చెపుతారు. హేతువుతో, తర్కంతో సత్యం నిరూపణ గాక పోయినా, వారు జెప్పే సత్యం హేతుబద్ధంగా తర్క యుక్తంగా ఉంటుంది. ధ్యానం గూర్చి చెపుతారు. ప్రేమ గూర్చి చెపుతారు. మరణం గూర్చి చెపుతారు.

ఆలోచనారాహిత్యం గూర్చి, తెలివి పుట్టుకను గూర్చి చెపుతారు. మతపరమైన మనస్తత్వం గూర్చి చెపుతారు. నూతన సమాజ నిర్మాణం గూర్చి చెపుతారు. ప్రకృతి పారవశ్యతను గూర్చి, పర్యావరణం గూర్చి చెపుతారు. విద్యగూర్చి, వికాసం గూర్చి, విహారం గూర్చి చెపుతారు. తత్వం గూర్చి చెపుతారు, సిద్ధాంతాల గూర్చి విమర్శనాత్మకంగా మాట్లాడతారు. కులమత జాతీయతలు చేసే విధ్వంసాన్ని గూర్చి పలుకుతారు. నిజ జీవితానకి సంబంధించిన ప్రతి విషయం గూర్చి కూలం కషంగా,లోతుగా చర్చిస్తారు. సన్యాసులతో, శాస్త్ర వేత్తలతో, పండితులతో, విద్యాసక్తులతో, దుఃఖితులతో, సైన్సు జ్ఞానులతో, కళాకారులతో, రాజకీయ వాదులతో, సైకాలజిస్టులతో, స్త్రీలతో, పిల్లలతో - ఎల్లరితో సుదీర్ఘంగా చర్చించేవారు. బుద్ధి తీక్షణత, అనుభవగాఢత, ప్రేమ ప్రసారత, ధ్యానశీలత, జీవన వాస్తవికత వారి సంభాషణల్లో ద్యోతకమవుతుంటాయి. చర్చించడం వారికిష్టం. తద్వారా సత్యావగాహన కల్గించేవారు.

**కొన్ని విశేష విషయాలు :**

(ఆలోచన - ధ్యానం - అవగాహన - స్వేచ్ఛ - మార్పు - విముక్తి గూర్చి)

ఆలోచన యొక్క తీరుతెన్నులను, స్వరూప స్వభావాలను, పరిమితులను ప్రయోజనాలను కృష్ణజీ లోతుగా పరిశీలించారు. కూలంకషంగా చర్చించారు. విపులంగా వివరించారు. ఆలోచన కూడ భౌతిక పరిణామమే. దానికి హద్దులున్నాయి. మనసు సాఫ్ట్‌వేర్ లాంటిది. దేన్ని స్వీకరిస్తే దాన్ని తిరిగి అందిస్తుంది. ఆలోచనలకు గతం మూలం. అనుభవం - సంస్కారం - వాసనలు - ఇతరులు చెప్పేది - చదివింది - విన్నది మొత్తం ఆలోచనలకు ఆకరం. స్మృతి నుంచి ఆలోచన పుడుతుంది. స్మృతి గతానిది. ఆలోచన నుండి అభిప్రాయాలనేకం వస్తాయి. ఆలోచన నుండి సైన్సు పుడుతుంది. సైన్సుకు ఎప్పుడూ కొత్తది కలుపుకుంటూ పోవలసిందే. సైన్సుకు సంపూర్ణతలేదు. ఏ ఆలోచనా సంపూర్ణమైంది కాదు. అసంపూర్ణమైన దానితో, సంపూర్ణమైన దానిని కొలవలేము. పరిమితమైంది అపరిమితాన్ని ఇముడ్చుకోలేదు.

సైన్సు గత పరిశోధనలపై ఆధారపడి ముందుకు సాగుతుంది. నిత్య నిర్వహణలో స్మృతి, లేక జ్ఞాపకం అవసరం. భౌతిక విషయాల్లో ఆలోచన అవసరం. మానసిక విషయాల్లో ఆలోచనతో పనిలేదు. ఆలోచనలతో ముడిపడి పోతే గతంలో నున్నట్లే

లెక్క. మనం అనుభూతి చెందాల్సింది వర్తమానంలోనే. సమస్య ఇపుడు తీరాలి, భవిష్యత్తులోకాదు. కాబట్టి ఆలోచన వర్తమాన మానసిక సమస్యలను తీర్చలేకున్నది. దైవాలోచనలూ అంతే. ఆలోచనతో చేసే దేదీకూడ అలౌకికం కాదు. పునశ్చరణలతో మనం లౌకికంలో ఉంటూ దాన్ని అలౌకిక మంటున్నాం. అది భ్రమ. ఆలోచన యొక్క పరిమితులు తెలియాలి. పరిమిత ప్రయోజనాలు తెలిసి, దాన్ని వాడుకోగలిగి ఉండాలి.

జ్ఞానం ఆలోచనకు సంబంధించిందే. సమాచార సేకరణ బాగా చేయగలిగిన వాణ్ణి జ్ఞాని  అంటున్నాం. సమాచారంలో అనుభూతి ఉండదు. గత అనుభవాల నుంచి, గతం నుంచి జ్ఞానం పుడుతుంది. జ్ఞానం, స్మృతి ఒకటే. కనుక జ్ఞానం ముక్తి నివ్వదు. ముక్తి అంటే విడుదల.సంపూర్ణ స్వేచ్ఛయే ముక్తి - సర్వ బంధాలు తెగిపోవడం. మానసిక బంధాల పీడ మరీ ఎక్కువ. ఇంద్రియ విషయాలకు లోనుగానిది స్వేచ్ఛ, ఇంద్రియ విషయాలను కూడ స్వేచ్ఛ వినియోగించు కొంటుంది. అదియే ప్రజ్ఞ లేక తెలివి. తెలివి మాత్రమే స్వేచ్ఛ నిస్తుంది. అది ఎప్పటికప్పుడు పుడుతుంది. ఆలోచనారాహిత్యం నుంచి ఉద్భవిస్తుంది. తెలివి ఆలోచన కాదు. స్వేచ్ఛకు ఎరుకకు సంబంధం ఉంది. అది ఒక స్థితి. జాగృతమైన స్థితి. అవగాహన జ్ఞానానికి వేరైంది. అవగాహన వల్ల  స్వేచ్ఛ, ముక్తి లభిస్తాయి.

అలాగే ప్రేమ ఆలోచనకాదు. అలోచన ప్రేమ కాదు. ప్రేమ కానివి మనకు తెలుసు. ప్రేమలేని వారికి ప్రేమ గురించి తెలియదు. ప్రేమకానివి స్వార్థం, పక్షపాతం, రాగద్వేషాదులు. అవి మనకు తెలుసు. వాటిని వదిలితే ప్రేమ ఏమిటో తెలుస్తుంది. ఆలోచనతో కూడిన సైన్సుతో పాటు ఆలోచనా రహితమైన ప్రేమను సృష్టించ గలిగితే అదే స్వర్గధామం -సుఖశాంతుల నిలయం - దివ్యలోకం - ఒడుదుడుకులు లేని నిలయం. సైన్సు ద్వారా, నిర్వహణ ద్వారా కొరతలు, జీవితావసరాలు తీరాలి. ప్రేమ ద్వారా శాంతి భద్రతలు చేకూరాలి. సైన్సూ, అంతరంగం ఏకం కావాలి, సమన్వయం చెందాలి.

ఆలోచనతో కూడింది, కోరికతో కూడింది. లబ్ధితో పెనవేసు కొన్నది;  ధ్యానం కాదు, ఏ ప్రక్రియ, ఏ ఫథకం ధ్యానం కాదు. "ఏకాగ్రత"తో పది నిమిషాలు చేసేది ధ్యానం కాదు. ఆసక్తితో, సావధానతతో కూడింది ధ్యానం. దానికి ఆలోచనతో పనిలేదు. ధ్యానమొక సమస్థితి. అది ఎక్కడున్నా, ఎవరితో ఉన్నా, ఏం చేస్తున్నా కొనసాగు తుంది. జాగరూకత, ఎఱుక, స్వేచ్ఛ, ప్రజ్ఞ ధ్యానంలో మిళితమై ఉంటాయి.

ప్రేమను పాదుకొల్పేదే ధ్యానం. ప్రేమ లేకపోతే, ధ్యానంలేదు. శబ్దం, మంత్రం, సూత్రం, అపేక్ష, ధ్యేయం ధ్యానానికి అంగాలనీ, మెట్లనీ భావిస్తే అది ధ్యానాన్ని అర్థం చేసుకోవడం కాదు. "నేను" అనే కేంద్రం పోవడం ధ్యానం.

మనిషిగా గాక, మరోరకం గుర్తింపుకై ఆరాటపడడం విభజనకు దారి తీస్తుంది. మానసికమైన గుర్తింపు, వేరు పరచు భావన ప్రమాదకరమైనవి. వేషభాషలు, నామరూపాలు వ్యవస్థకు చెందినవే గాని పవిత్రతకు చెందినవి గావు. పరిశుద్ధత అంతరంగానికి చెందింది. విభజన పవిత్రతను చెడగొడ్తుంది. విభజన ఘర్షణ కల్గిస్తుంది. కులంగాని, మతంగాని, జాతీయ భావన గాని మనిషిని మరొకటిగా జేసే మానసిక ముద్రలు. అవి మనుషులను విభజించడమే గాక, మనుషులను మనుషులుగా బ్రతకనీయవు. అవన్నీ ఆలోచనతో పోషింపబడి, భౌతికంగా దుష్ట పరిణామాలను కల్గిస్తాయి. కనుక సమగ్రంగా, అవిభాజ్యంగా, అఖండంగా జీవించాలంటే మానసిక విభజనలను తక్షణం విడనాడాలి. ఇలా మూలాలను విప్లవాత్మకగా సరిచేయాలేగాని, పైపై సంస్కర ణతో మార్పు రాదనేది గ్రహించాలి.

ప్రాణాయామాది యోగ ప్రక్రియలు, సాధనలు ఆరోగ్యసిద్ధికి తోడ్పడవచ్చు. మానసికంగా మార్పును తేలేవు. భౌతికమైన మార్పుకు కాలవ్యవధి కావాలి. మానసికమైన మార్పుకు కాలంతో పనిలేదు. తక్షణమే జరగాలి. మంచి వాడు చెడ్డవాడుగా గాని, చెడ్డవాడు మంచివాడుగా గాని కావడానికి ఎంత కాలం కావాలి? మనసుకు పట్టిన చిక్కులు, బీభత్సం విరగడ కావలసింది ఇప్పుడే గాని భవిష్యత్తులో, ఎప్పుడోకాదు. మనసు విముక్తం కావలసిది వర్తమానంలోనేగాని, ముందుముందూ కాదు, మరుజన్మలోనూ కాదు. ఇప్పటి సమస్య ఇప్పుడే తీరాలి. కాలక్రమేణాగాదు, కాలానంతరమూ కాదు. మానసికంగా (సైకలాజికల్) కాలమంటూ లేదు. అంత రంగికంగా కాలం లేదు.

ఆధ్యాత్మికం అంతరంగానికీ మనసుకూ సంబంధించింది. అలాంటి వాటిల్లో కాలం లేదని గ్రహించడం గొప్పమార్పు, గొప్ప విప్లవం. అయితే సాధన అనేది కాలంతో ముడిపడివుంది. వస్తాదు కావడానికి సాధన కావాలిగాని, మానసిక పరివర్తనకు సాధనతో పనిలేదు. తీవ్ర అవగాహన కావాలి. అది ప్రజ్ఞావిశేషం. అది సద్యోసావధాన ప్రక్రియ. తీవ్రమైన మార్పుతో పాటు బ్రెయిన్ (మెదడు)లో బయోలాజికల్ (భౌతికరసాయనిక)

మార్పు వస్తుంది. అది గొప్ప, పరివర్తన- Mutation.

మనిషికి స్వేచ్ఛలేదు. మానసికంగా బంధితుడు, బాధితుడు. మానవ మస్తిష్కం వేలసంవత్సరాలనుంచి కండిషన్డైపోయింది. నిబద్ధమై పోయింది. దేనికో ఒక దానికి కట్టుబడి పోయింది. భద్రత నిమిత్తం కట్టుబడి పోతుంటుంది. భౌతికంగా కొంత భద్రత అవసరమే. అదే భద్రత మానసికంగా కావాలనుకొని దేనికో కట్టుబడి పోతాడు. మెదడు కణాలు అలా ఘనీభవించి పోతాయి. ఒక విధానం (ప్యాట్రన్)లో మూసుకు పోతాయి. అపుడు మానవుడు స్వేచ్ఛకోల్పోతాడు. అందుచే శీఘ్రంగా మార్పు జెందలేకున్నాడు. మార్పంటేనే మనసు మొరాయిస్తుంది. పరమ బద్ధకస్తుడూ, సోంబేరీ నిద్రనుంచి మేల్కొనాలంటే మొండికేస్తాడు కదా!

అలాగే నిబద్ధమైన మనసు (Conditioned mind) స్వేచ్ఛ పొందాలంటే వెనకడుగు వేస్తుంది. దానికి తోడు సాధన భ్రమ గొల్పుతూ ఆశపెడుతూ మార్పును వాయిదా వేస్తుంది. శాస్త్రం - ఆచరణ, ధర్మం - ఆచరణ, బోధ - ఆచరణ, సూత్రం - ఆచరణ, సిద్ధాంతం - ఆచరణ అని రెండుగా చూస్తారు. ఆరెంటి మధ్యలో సాధనొచ్చి జేరింది. దానికి కాలం కావాల్సొచ్చింది. మార్పును పక్కదారి పట్టిస్తుంది. ఇదంతా ఆలోచనచేసే పని. కాలం లేనపుడు ఆసక్తిగా వినడమే మార్పు నిస్తుంది. తెలియడమే ఆచరణ అవుతుంది. అర్థం కావడమే క్రియాశీలకం.

ఈ నేర్వడమనే మానసిక శిక్షణ నిరంతరం జరుగుతుంటుంది. అది సహజంగా పరిణత జెందుతుంది. అలవాటైన ప్రక్రియగాని, మానసిక నిబద్ధతగాని బ్రద్దలు గావాలంటే తీవ్రత ఉండాలి, గాఢత ఉండాలి, లోలోతులకు చూడాలి. నిజావగాహన నిలవాలి అంటే తన్ను గూర్చితాను తేటతెల్లంగా తెలియాలి. తనపై తనకు నిఘా ఉండాలి. మార్పు మౌలికంగా, విప్లవాత్మకంగా ఉండాలి. అదే మానసికమైన రాడికల్ ఛేంజి (Radical Change). సంప్రదాయాన్ని ముక్కలు జేసే విప్లవం అంతరంగంలో చెలరేగాలి. అప్పుడే మార్పు - స్వేచ్ఛ - విముక్తి - విక్రాంతి వుంటాయి.

# ౬. సృజనాత్మకత - కృష్ణమూర్తి

"సృష్టి వ్యక్తీకరణ కోరదు. ఆ సృజనాత్మకతా గమనంలో చిత్రలేఖనం, సాహిత్యం, సంగీతాదులలో తన్ను తాను ప్రకటించుకోవాలని కాంక్షించే నేను - నాది అనేవి ఎంత మాత్రం ఉండవు" సృష్టి అంటే ఏమిటో, సృజనాత్మకత అంటే ఏమిటో జిడ్డుకృష్ణమూర్తి విలక్షణంగా జూశారు.

'నేను' ప్రదర్శితమైన చోట సృజనాత్మకతలేదు. సృష్టి అద్భుతమైంది. సహజానంద దాయకమైంది, ఎప్పటికప్పుడు నవశోభతో విరాజిల్లుతుంటుంది. అది విభజనాత్మకంకాదు. సృష్టికర్మను ఊహించుకొని, వేరుగా చూసినచో అందం, ఆనందం, ప్రేమ అంతరిస్తాయి. సృజనాత్మకతలో 'నేను' ప్రవేశించిందంటే అది సృజనయేకాదు. ఆలోచన లేని చోట సృజనాత్మకత ఉంటుంది. ఆలోచనతో జేసేవి ఏవీ సృజనలు కావు. అలోచన ఎంత బలమైనదంటే, ఎంత దుష్టమైనదంటే, చచ్చినా పడిలేస్తుంది. నేనున్నానని ముందు కొస్తుంది. సృష్టి కర్తను తెచ్చిపెడ్తుంది. ఆలోచనే 'నేను'. అంతరంగ మంతా ఆలోచనతో, అసహ్యంగా, ఉన్నపుడు, దాన్నుండి ఎంత ప్రశస్తమైన కళాఖండం తయారయినా అది సృజనాత్మకమైందికాదు. దానిలో ఒరిజినాలిటీ ఉండదు.

అంతరంగం దుష్టమైనపుడు కళకూడ దుష్టపరిణామాన్నిస్తుంది - అది సైన్సు గానీ, సాహిత్యంగానీ, సంగీతంగానీ- అవి సృజనలు (Creations) గావు, కనుగొన బడినవి (Inventions) మాత్రమే; అరువు తెచ్చుకున్న సమాచారంతో, గతంతో ముడిపడినవే. అందుచేతనే ప్రపంచంలో ఎన్ని కనిపెట్టినా, ఎన్ని రచించినా అవి కొంత సౌఖ్యాన్ని వినోదాన్ని ఇస్తున్నవేగాని మానవుని దుఃఖాన్ని తీర్చడంలేదు, అతన్ని మార్చడంలేము. ఈ లెక్కన మనకు ఇంత కాలం ఆలంబనమైన కళావేత్తలు, శాస్త్రకారులు, సైంటిస్టులు, వాళ్లు కనిపెట్టినవి మనకు నిరుపయోగమే గాక, వాళ్ల విధానాలు విధ్వంసకరమని మనం గుర్తించాలి.

మనలో సృజనాత్మకత లేనందువల్ల, సమాజాన్ని ఈ సంక్షోభ స్థితికి దిగజార్చాం. మన మనోవైఖరి ముఖ్యమైంది. మనసు సృజించడం విరమించినప్పుడు, సృష్టి టుంది. ఇంకా చెప్పాలంటే అంతం చేయడంలో సృజనత్వం ఉంటుంది గాని, ంసాగించడంలో లేదు. 'నాది' అనే దాన్ని సంపూర్ణంగా అవగాహన చేసుకొన్నపుడు ష్ట స్థితిని అనుభూతి చెందగలం. మనస్సు నిశ్చలంగా ఉన్నపుడు మాత్రమే ఐనాత్మకత వుంటుంది. నేర్చుకోవడం - గ్రహించడం అంటే ఏమిటో తెలిసినపుడు

సృజనాత్మకత వుంటుంది. శక్తిని ప్రయత్న పూర్వకంగా కాకుండ, సహజంగా కేంద్రీకరించడం జరగాలి. ఆశక్తికి ఏదిశవైపుకూ చలనముండరాదు. ఆ క్షణంలో సృజనత్వం వుంటుంది. నేపథ్యంలో ఉద్దేశం లేనపుడు మాత్రమే సృజనత్వం వుంటుంది. త్యజించడం ద్వారా కలిగే సరళత్వం సృజనాత్మక సౌందర్యాన్నిస్తుంది. సృజనాత్మకమైన మనస్సు ఎప్పుడూ ఖాళీగా ఉంటుంది. ఆఖాళీనుంచి పని చేస్తుంది, అఖాళీనుంచి మాట్లాడుతుంది. తెలిసిందానికీ తెలియందానికీ మధ్యగల సమన్వయ చలనం సృజనాత్మకమైంది, అద్భుతమైంది.

సృజనాత్మకత అంటే కేవలం పద్యాలనో ప్రతిమలనో ఉత్పత్తి చేయడం కాదు; సత్యావిష్కరణ కలించే స్థితిలో ఉండడం. మందగొడి తనాలన్నిటి నుండీ, విచ్ఛిన్నతలన్నిటి నుండీ. సృజనాత్మకత విముక్తి నిస్తుంది. ఆ స్థితి మనుషులు తయారు చేస్తేనో సాధన చేస్తేనో వచ్చేది కాదు. ఆసృజనాత్మక శక్తిని గ్రహించడానికే ధ్యానం అవసరం. అది ప్రేమ ద్వారానే సాధ్యం. దానికి సమాచార జ్ఞానంతో సంబంధం లేదు. విస్మరణ, ప్రేమ ఉన్నపుడు మాత్రమే సృష్టిసాధ్యం. ఇవి అభిప్రాయాలు కావు అనుభూతులు, కల్పనలు కావు, వాస్తవాలు, చిలక పలుకులు కావు హృదయ మధువులు. ప్రవచనాలు కావు పరిశీలనలు. నీతి బోధనలు కావు, సత్య శోధనలు. అవి కృష్ణమూర్తికే చెల్లాయి. అనితర సాధ్యాలుగా కన్పడుతున్నా, అవగాహనే ప్రధానమనుకొన్నవారికి అసాధ్యాలుకావు. స్వీయావగహనే ప్రధానమను కొన్నవారికి అసాధ్యాలు కావు. అవగాహనే కృష్ణమూర్తి; అనురాగమే కృష్ణమూర్తి; అసలు తాత్త్వికతయే కృష్ణమూర్తి.

20-2-2000

# 7. జీవిత సమగ్రత - జిడ్డుకృష్ణమూర్తి

పరిపూర్ణ వ్యక్తిత్వం వేరు. ప్రత్యేక వ్యక్తిత్వం వేరు. ప్రతి వ్యక్తీ పరిపూర్ణుడు కాదు. ప్రత్యేకవ్యక్తులు అనేకులుండవచ్చు. కాని పరిపూర్ణునిలో, సముద్రంలో నదుల్లా ప్రతీవ్యక్తిలయించి పోతాడు. అంటే నిండుతనం వేరు, పరిమితం వేరు. నిండుతనం గంభీరంగా ఉంటుంది. పరిపూర్ణతను జీవించవలసిందే. దానిని నిర్వచించటం సాధ్యం కాదు. Full man, Perfect man అనేవాడకం ఇంగ్లీషులో ఉంది. ఫుల్‌మ్యాన్ అంటే నిండు మనిషి. పెర్‌ఫెక్ట్‌మ్యాన్ అంటే సమగ్రత గలవాడు లేదా ప్రత్యేక నిపుణుడు

అనవచ్చు. మొదటి వ్యక్తికి జీవితాంశాలన్నిటిలోను నిండుతనం ఉంటుంది. రెండవ వ్యక్తికి ఒకటి లేక కొన్ని అంశాలలో పూర్తి నైపుణ్యం ఉంటుంది. విజ్ఞాన అంశాలపై నైపుణ్యం, ప్రత్యేకతల వలన ఉపయోగముంది. మానసిక అంశాలపై నిండుతనం కావలయును గాని ప్రత్యేకతలు కావు. అందుచే వికాసంలో పూర్ణత్వముండాలి. పూర్ణ పురుషులు ఉండాలి.

పరిపూర్ణ జీవితంలో లోతైన అనుభూతులుంటాయి. వినూత్న అవగాహన. ఆలోచనలు ఉంటాయి. విశేష ఆచరణ లుంటాయి. క్రియలు సహజంగా ఉంటాయి. సక్రమంగా ఉంటాయి. అన్నిటికీ మూలమైన మనస్సు స్వచ్ఛంగ, స్వచ్ఛందంగ వుంటుంది. అది పరస్పర సంబంధం ద్వారా తెలుస్తుంది.

పరిపూర్ణతకు బదులు సమగ్రత అనేపదం కూడ వాడతారు. రెంటికీ ఛాయా భేదం ఉంది. రాశిలో వాసిలో తేడాలు ఉన్నాయి. సమగ్రత సంపూర్ణతకు దారితీస్తుందని మాత్రం చెప్పవచ్చు. సమగ్రతలో కొన్ని పదార్థాలు లేక గుణాలు లేక భావాలు ఉంటాయి. వాటిని గుర్తిస్తాము. అవి కలిసి ఉంటాయి; సమ్మిలితమై ఉంటాయి. సమపాళ్లలో ఉంటాయి; ఏకమై ఉంటాయి; సమైక్యంగా పెరుగుతాయి. లేదా ప్రతి ఒక్కదానిలో మరోదాని ప్రభావం వుంటుంది. పనితీరు సరళంగా తేట తెల్లంగా వుంటుంది. అందుచే సమగ్రజీవనం యొక్క వికాసం క్రమంగా, సహజంగా ఉంటుంది. జీవితంలో సమగ్రత యొక్క ఆవశ్యకతను బాగా గుర్తించాలి.

మానవులెందరో పేరు ప్రతిష్ఠలతో మహనీయులుగా చెలామణి అవుతు న్నారు. ఆధ్యాత్మికరంగంలో అధిష్ఠాన స్థితికి వెళ్లిన వారు,సైన్సు క్షేత్రంలో శ్రేష్ఠులైన వారు, సాహిత్య కృషిలో శిఖరాగ్రాన ఉన్న వారు ఇలా అనేక శాఖలలో ఉన్నతు లున్నారు. మరోవిధంగా చూస్తే జీవితంలో మత పరంగానో, బుద్ధి కుశలత ద్వారానో, ప్రత్యేక శాఖ ననుసరించో సుప్రసిద్ధులైనవారున్నారు. ఏదో ఒక అంశం ద్వారా అత్యధికులైనా, అది మిగతా అంశాలలో సరిపడదు. సమన్వయం కుదరదు. అందుచే సమగ్రత లేదని తెలుస్తుంది.

సంప్రదాయాన్ని కాదని కొంతమేరకు సంస్కరణ పొందిన వారూ, విప్లవ పంథా చూపిస్తూ సంప్రదాయం పాటించే వారు, మార్పు అవసరమని, తెలిసినా, ఇతరుల కొరకు సంప్రదాయాన్ని కాదనలేని వారూ చాలా మంది ఉన్నారు. వారిలో సమగ్రత

లేదని చెప్పాలి. చెప్పేదానికీ చేసేదానికీ పొంతన ఉండదు. అది అసమగ్రతాలక్షణం.

ముందు ఒక ధ్యేయమేర్పరచుకొని, దానికనుగుణ్యంగా అవగాహన పెంచుకోవడం సమగ్రతకాదు. ఏ ఎండకు ఆ గొడుగు పట్టే అవగాహన అసమగ్ర మైంది. ఒకేరూపంలో ఉన్న అవగాహన సమగ్రతను చేకూర్చగలదు. భావరీత్యా పరస్పర వ్యతిరేకతలను సమన్వయించుకోవడం సమగ్రతకాదు. అనుభూతి పరంగా, జీవించడం ద్వారా దర్శించే సమత్వమే సమగ్రత. శరీరం, మనసు, హృదయం కలిసి పనిచేయడమూ, పయనించడమూ సమగ్రత. అంతరంగ విషయాలూ బయటి వాస్తవ విషయాలు సమన్వయ పడడం సమగ్రత. వైజ్ఞానిక విషయాలతో మానసిక ధోరణుల సమన్వయం చెందిన మేరకు సమగ్రత చేకూరినట్లే. స్థాయీభేదమూ, దశాభేదమూ, విభజనలు సృష్టించని అవగాహన సమగ్రమైంది. ఏ రంగంలోనైనా, ఏ విషయంలోనైనా జీవన సత్యానికి భంగమూ, సవరణ రానంత వరకూ సమగ్రత వుంటుంది. జీవితమనే యూనిట్‌లో జీవిత సంబంధమైన విషయాలూ సంగతులూ అన్నీ ఎప్పటికప్పుడు సమాధాన పడూతూ సమన్వయ చెందుతూ సాగిపోతుంటాయి. ఇది అవసరార్థం చేసుకొనే సర్దుబాటుకాదు. సహజమైన ప్రక్రియ - అదే సమగ్రత.

Integration is holistic approach - సమగ్రత అంటే సాంగోపాంగమైన అవగాహన. అది సత్యసాధకం. యదార్థతను నిండుతనాన్ని ఇస్తుంది. సమగ్రత నేది జీవన సరళిలో ద్యోతకం కావాలి. నిత్య వ్యవహారంలో కనపడాలి. సమగ్రత తార్కికమైనది. సహేతుకమైనది.

సమగ్రతకు నిర్వచనం బుద్ధిపరంగా గాక, జీవితపరంగా ఏర్పడింది. అది జిడ్డుకృష్ణమూర్తి జీవితంలో, బోధనలలో మనం గమనిస్తాం. మానసికమైనవీ, కాల్పనిక మైనవీ, అన్నీకూడ విభజనాత్మకాలు, విభేదకారకాలు. వాటిలో ఊహాతప్పదు. వాస్తవంకాని వాటిని సూత్రాలుగా, ఆచరణరూపాలుగా గ్రహించడమే సమగ్రతకు మొదటి గొడ్డలి పెట్టు. మానసికంగా కల్పించుకున్న కుల- మత - జాతీయతా విచక్షణలూ, వాటి విలువలు నిజానికి గాలిలో పేకమేడలు. వాటిని విశ్వసించడం గానీ, వాటిలో నివసించడంగానీ, వాటికి సంబంధించిన ఆచరణలు గానీ పూర్తిగా విచ్ఛిన్నకరమైనవి. భ్రమలు కాబట్టి సమగ్రతను భంగపరుస్తాయి. కలుపుగోలు తనానికి ఆయువు పట్టు అయిన మూల పదార్థం యొక్క సారాన్ని హరించివేస్తాయి. పేరుకు ఫలానా అని పుట్టినా తాను బ్రాహ్మణుడు కాదనీ, తనకు జాతీయత లేదనీ

నిస్సంకోచంగా ప్రకటించారు కృష్ణమూర్తి గారు.

మతాన్ని నమ్ముకుంటే మతసమన్వయమూ, కులతత్వ వివక్షతా రాహిత్యమూ అనేవి కుదరవు. మతవిశ్వాసాలు అవాస్తవాలపై ఆధార పడ్డాయి. అవి తృప్తి నిమిత్తం తెచ్చి పెట్టుకొన్నవి. ప్రశ్నకు, పరీక్షకు, పరిశోధనకు నిలిచేవికావు. అవి భావరీత్యా బలపడి జనాన్ని విభజించి పబ్బం గడుపుతుంటాయి. వాటివల్ల సమగ్రత ఎలా లభిస్తుందీ? మతాలున్నంత వరకూ మతసమన్వయం లేదు.

మతం వేరు, మతపరమైన జీవితం వేరు. క్రైస్తవం వేరు, క్రీస్తు జీవితం వేరు. Religion is different from religious mind. మతం సమష్టిదిగా అనుసరిస్తున్నారు. భావం వ్యష్టిది. మతపరమైన మనసు కలిగివుండం వ్యక్తిగత మైంది. పవిత్రత అనే ఒక మానసిక స్థితి కల్గి, స్వేచ్ఛ - సమత -ప్రేమ - స్పందన - సక్రమ సంబంధంతో తెలివిగా జీవించడమే మత పరమైన మనసు కలిగి వుండడం. ఇలా కాకుండా వేదికపై చేసే మతసామరస్యాలు, కులసమన్వయాలు భ్రమలు, వృధాశ్రమలు.

దైవం - ఆత్మ - ఆధ్యాత్మిక విషయాల గూర్చి కృష్ణజీ (కృష్ణమూర్తి)కి నిష్పాక్షికమైన దృక్పథం ఉంది. ఇవి ఊహకు, చిత్త ప్రవృత్తికి సంబంధించిన విషయాలు. ఇవన్నీ యదార్థమని తరతరాలనుండి నూరిపోశారు. గ్రంథాలు వ్రాసి, వాటికి పవిత్రత, సాధికారత అంటగట్టారు. వాటినైజమిదీ అని తెలియజెప్పటానికి గురువును మించిన గురువులూ, మనిషిని మించిన అవతార పురుషులూ, మహిమల మత్తు జల్లు బాబాలూ కోకొల్లలుగా తయారవుతున్నారు; ప్రబోధకులు పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నారు; వారంతా దైవాత్మ స్వరూపులన్న భ్రమకల్గిస్తున్నారు. కాగా, దేవాలయాలు - ఆరాధనలు - ధ్యానంలో కొత్త కొత్త టెక్నిక్కులు - ధనం -అధికారం -అత్యాశ విజృంభించి, ఇంకా చెప్పాలంటే వ్యాపార ధోరణిలోపడి మానవుని క్రుంగదీస్తున్నాయి. ఇవన్నీ పిల్లచేష్టలని కృష్ణజీ కొట్టిపారవేశారు.

ఏ గురువూ నీకు వెలుగు చూపించలేడు. చీకటిలోనైన తడుముకొంటూ నీకు నీవే వెలుగు వైపు పోవాలి. ఇప్పటి - వర్తమానం - స్థితి (What is) సంపూర్ణంగా స్వయంగా అవగాహన చేసుకోకపోతే ఏ ఆదర్శపురుషుడు, ఏ సిద్ధాంతమూ నీకు మార్గదర్శకం కాదు. ఇవన్నీ నిన్నుబంధించేవే. దేవుళ్ళే అక్కర లేదనప్పుడు, ఇక దేవాలయాలెందుకు? అయితే సత్యము - దైవము - ఉన్నదా లేదా అని

తెలుసుకోవాలంటే నీకు నీవే పరిశోధన చెయ్యి. ఉన్నదని, లేదనిగాని ముందుగా నిర్ణయించుకోకుండా, నిర్వచించుకోకుండా ప్రశ్నించుకో, పరిశీలించుకో, పరిశోధించుకో, ప్రత్యక్షీకరించుకో. నిర్ణయానికి రావలసింది నీకు నీవే. అలా కానప్పుడు దైవమూ, సత్యమూ మనో జనితాలే, ఊహలే, పూర్వపు నిర్ణయాలే.

సాధన ఒక భ్రమ, ఒక వాయిదా, ఒక వంచన. సాధన, సంప్రదాయం, ఆశ, విశ్వాసం, ఊహ మనిషిని నిబద్ధిస్తాయి. కండలు పెంచుకోవాలన్నా, భాష నేర్చుకోవాలన్నా నిబద్ధత (కండిషనింగ్) అవసరం. మానసిక విషయాలలో నిబద్ధత స్వేచ్ఛను హరిస్తుంది. పరిశోధనను అడ్డగిస్తుంది. పరులపై ఆధారపడేటట్లు చేస్తుంది. సాధన అహంభావాన్ని పెంచుతుంది. అవగాహనను త్రుంచుతుంది. ధ్యేయం ఎన్నటికీ నెరవేరదు. ఎందుకంటే అది ఆదర్శమేగాని, సైద్ధాంతికమైనదే గాని వాస్తవం కాదుగనుక. దాంతో జన్మ పరంపరలు, పునర్జన్మలు, అవతారాలు, స్వర్గనరకాలు, వ్రతాలు - హోమాలు, నానాతతంగాలూ జనిస్తాయి. అది ఒక మాయాజాలం.

## నీవే ప్రపంచం

మనిషి నిత్యమూ బాధకు, శోధనకు లోనవుతున్నాడు. మానసిక సంఘర్షణకు గురి అవుతున్నాడు. తన సమస్యా వలయం తానే అల్లుకొని, అందులో చిక్కుకొని, పరిష్కారం వేరే చోట వుందని వెతుకుతున్నాడు. తన సమస్యకు బాధ్యుడు తానేనని అనుకోవడంలేదు. తాను అంతర్గతంగా ఎలా ఉన్నాడో బహిర్గతంగా అలాంటి లోకాన్ని తయారు చేసుకుంటున్నాడు. తానేలోకము. "నీవే పంచము, నీవు మారితే ప్రపంచం మారుతుంది" అంటారు కృష్ణజీ.

## నీవు మారు

స్వరూపం వ్యక్తికి వుందిగాని, సమాజానికి లేదు. సమాజం మారితే నేను మారతాననడం అర్థరహితం. వ్యక్తి స్వచ్ఛందంగా మారాలి, సహజంగా మారాలి. హృదయంలో మార్పు మొదలవ్వాలి. చిత్త ప్రవృత్తిలో విప్లవం చెలరేగాలి. ర్యాడికల్ ఛేంజి రావాలి. సంస్కరణ చాలదు. విప్లవంతో పాతదంతా, గతమంతా తుడిచిపెట్టుకు పోవాలి. వినూత్న పురుషులు వెలువడాలి. అలాంటివారు దుఃఖం, బంధం ఘర్షణ నుండి విముక్తులౌతారు. నిజమైన తెలివితో ప్రేమతో వర్ధిల్లుతారు.

### ఏకాంతంగా ఉండు

ప్రేమ యొక్క అగాధమైన లోతుల్ని ధ్యానంతో, సక్రమ సంబంధంతో, ఏముద్ర నమోదు చేసుకోని మనసుతో, అంతర్దృష్టితో ఓ అనుభూతి చెందవీలవు తుంది. ఏకాంతం (Alone - all in one) గా ఉండగల వాడే విముక్తుడు, పవిత్రుడు. అతనిలో అద్భుతమైన ప్రజ్ఞాశక్తి జనిస్తుంది. అదీ అసలు తెలివి, అది బౌద్ధికం కాదు. తద్వారా సమష్టి బాధ్యతగల వ్యక్తిగా, విశ్వమానవుడిగా నిజమైన Individual - indivisible గా రూపొందుతాడు. అతడు అఖండుడు, అదదయుడు, అనఘుడు, అవిభాజ్యుడు, సహజసమగ్రతామూర్తి.

### కృష్ణజీ ఎలా భావించారు?

ఈ విధంగా మౌలిక విషయాలను, లోతైన విషయాలను, నిత్య జీవిత విషయాలను, వాస్తవ మానవ సంబంధాలను, అరుదైన మానవ అనంత శక్తులను కృష్ణజీ పరిశీలించి చూశారు, అవగాహన చేసుకున్నారు, అలానే జీవించారు. సంఘర్షణగాని, పరస్పర వ్యతిరేకత గాని, అవాస్తవ ధోరణిగాని, అహేతుక విలువలు గాని లేకుండా 91 సంవత్సరాలు ఎరుకతో బ్రతికారు. అందులో 70 ఏళ్లు మానవ జీవన స్వేచ్ఛ నిమిత్తం ప్రబోధించారు. వినూత్న తత్త్వదర్శిగా, విశేష ప్రపంచ బోధకుడుగా, ఏ శాఖకు, ఏ సిద్ధాంతానికీ, ఏ సంఘానికీ, ఏ వేదాంతానికీ చెందని వ్యక్తిగా, కేవలం మానవత్వానికి చెందిన మానవోన్నతుడుగా, మమతా ప్రేమ మూర్తిగా సుప్రసిద్ధులయ్యారు. 1895మే11న జన్మించారు మదనపల్లెలో.

### కృష్ణజీ చర్చలు

జీవిత సమగ్రతకు సంబంధించిన పెక్కు అమూల్యమైన విషయాలు, లోతైన సంగతులు, సాదా సీదా విషయాలు అన్నీ చర్చించారు. అవిచ్ఛిన్నంగా, అవికల్పంగా, అనుభూతి పరంగా వివరించారు. ఆసక్తి పరులు ఒక్కొక్క విషయాన్ని తెలుసుకోవాలి, తరచి చూడాలి.

# 7. సత్యానురక్తి –జె.కె. దృక్పథం

**కృష్ణజీతత్వం:**

'జె.కె.'ను అధ్యయనం చేయునపుడు ఎవరైనాసరే గ్రహించదగిన ముఖ్యాంశాలు ఏమంటే -

మానవుడు కేంద్రం
జీవితం ప్రధానం
క్షణక్షణ వాస్తవమే సత్యం
యథార్థ స్థితిపట్ల ఎరుక

మొదట్నించీ స్వేచ్ఛ
చిత్త ప్రవృత్తిలో విప్లవం
అవగాహన - ప్రేమ
ధ్యానమయ జీవితం

అధ్యయనం చేసినకొద్దీ ఈ అంశాల పట్ల స్వీయ జ్ఞానం (Self Knowledge) ఉదయించగలదు. తద్వారా మార్పు సహజమౌతుంది. ఆత్మజ్ఞానం ద్వారా చిత్తంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చినపుడు భౌతికంగానూ మనసికంగానూ మెదడులో పూర్తిగా కొత్తదనం ఏర్పడుతుంది. జీవిత గమనం సమూలంగా మారిపోతుంది. ఇలా సరికొత్తగా, నిత్యం తాజాగా ఉండేటట్లు వయసు వచ్చే బిడ్డలకు వాతావరణం కలుగజేయడం పాఠశాలల బాధ్యత. తల్లిదండ్రులది కూడ. అందుకు దోహదపడేదే అసలు సిసలైన విద్య. విద్యా విషయంలో కృష్ణమూర్తిగారి ప్రబోధసారం ఇది. అంటే బిడ్డల సృజనాత్మకతకు విద్య దోహద పడాలని చూపారు.

**అర్థం చేసుకొనేతీరు :**

కృష్ణమూర్తిగారి హృదయం ఏమిటా అని తెలుసుకోవలసి వచ్చినపుడు విషయాలు క్రోడీకరించవలసి వస్తోంది. ఏ విషయం ప్రస్తావించి వారు మాట్లాడినా అది సహేతుకంగా, వాస్తవికంగా, జీవితపరంగా, బాధ్యతా యుతంగా, ప్రేమాస్ప దంగా వుంటుందనేది సత్యం. ఎంత జటిలంగా తోస్తుందో అంత సరళంగా ఉంటుంది. ఎంత తీక్షణంగా ఉంటుందో అంత నెమ్మదితనంగా ఉంటుంది. అంటే నిత్య సత్యాలు జీవితం ద్వారా అర్థం చేసుకోవడం, అన్వయం చేసుకొని చూడడం, అవసరం కదా!

ఈ సమావేశపు విషయమైన Quest for truth తీసుకుందాం. దీన్ని సత్యాసక్తి లేక సత్యానురక్తి అనుకుంటే సామాన్యంగా అర్థమవుతుందనుకుంటా. దీన్ని వర్తమాన సామాజిక - వ్యక్తిగత జీవితానికి అన్వయించుకోవాలి. నిత్యజీవిత వాస్తవికతలో ఇది అవగాహనకు రావాలి.

**సత్యాన్ని గ్రహించేదెలా:**

సత్యం గ్రహించడానికి మార్గం నీతి అనీ, మతమనీ, అభ్యాసమనీ, శిక్షణ అనీ, ధ్యానమనీ, శాస్త్రమనీ, ఎరుక అనీ పరిపరి విధాలుగా మనం వింటున్నాం. దీన్నిబట్టి సత్యం వేరే వస్తువనీ, దాన్ని వెదికి పట్టుకొని సొంతంచేసుకోవడం మన జీవిత లక్ష్యమనీ అర్థం ద్యోతకమవుతోంది. లేదా అది నీలోనే వుంది, నివురు గప్పిన నిప్పులా వుంది, నివురు పోయి నిప్పు దర్శనమివ్వాలంటే నిరంతరం శిక్షణ అవసరమని చెప్పడం జరుగుతోంది. దీన్నే మాయావరణం ఛేదించడం అంటున్నారు. కాని కృష్ణజీ వీటన్నిటిని ఒకేమాటలో కొట్టివేశారు. "సత్యానికి మార్గమంటూ లేదు" అన్నారు. అంటే అర్థమేమిటి? ఇక్కడ కొంత ఇంటర్ ప్రెటేషన్ (నేనుదాన్ని అన్వయం అంటాను) అవసరమేగదా!

**సత్యమంటే?**

వాస్తవంగా ఉండడం సత్యం. యధార్థంగా ఉండడం సత్యం. ఉన్న దున్నట్లుగా చూడడం సత్యం; లేనిది లేనట్లుగా గ్రహించడం సత్యం. జీవిత స్థితి లేక మానసిక స్థితి చలనశీలమైంది. అంటే క్షణం నుండి క్షణానికి మారుతూ, గడుస్తూ వుంటుంది. సత్యం ఏక్షణానికి ఆక్షణం గ్రహించేది. అప్పటి అనుభూతి అప్పటిదే. ఒకప్పుడు గ్రహించింది ఎల్లప్పటికీ అంతేకాదు. ఆవిధంగా సత్యం శాశ్వతమైంది అని చెప్పటానికి లేదు. నీటి ప్రవాహం అఖండంగా సాగుతున్నా, ఒక పాయింటు దగ్గర ఎప్పటికప్పుడే తాజా నీరులభిస్తుంది. ప్రవాహం ఒక్కటైనా నీటి గుణం మారుతూ ఉంటుంది. సత్యం క్షణక్షణం తెలుసుకోవలసిందే; అంతమాత్రాన క్షణికం అనలేం. నిరంతరం తెలుసుకుంటూ లేక అనుభూతి చెందుతూ ఉండాలి. అందుచే అది శాశ్వతమైందని లేక అశాశ్వతమైందని అనలేం.

**మతపరమైన మనస్సు :**

జె.కె. సత్యాన్ని తెలుసుకోగల మనసు గురించి చెప్పారు. అనుభూతి చెందడం

వేరు, ఊహించుకోవడం వేరు. కాబట్టి పలానిది సత్యమని ముందుగానే ఊహించరాదు. ఎవరో చెప్పింది నీకు సత్యంకాదు. ఊహించే మనస్సూ, నమ్మే మనసు పనికిరాదు. దేనికీ కట్టుబడి పోకూడదు. అవేశకావేశ రోషాలకు లోబడరాదు. స్వచ్ఛందంగా స్వేచ్ఛగా వుండాలి. ప్రశ్నార్థకంగా, పరిశీలనాత్మకంగా, లోదృష్టి కలిగి వుండాలి. నెమ్మది తనం వుండాలి. పరిశోధనలో పొరలు పొరలు దాటిన కొలదీ సత్యం గోచరమవుతుంటుంది. సత్యాన్ని గుర్తించ గలిగింది నిష్పాక్షికమైన, నిర్మలమైన తెలివి. అది ప్రేమతోకూడి వుంటుంది. ప్రేమగల హృదయం సత్యం తెలుసు కొంటుంది. అదే నిజమైన మతపరమైన మనస్సు.

**సంప్రదాయం:**

సంప్రదాయార్థంలో ఉన్నమతం సత్యాన్ని గుర్తించలేదు. ఎందుకంటే అది సంస్థాగతమైంది, వ్యవస్థీకృతమైంది. దానికి బ్యానరు ముఖ్యం. ప్రచారం ప్రధానం. సత్యం వ్యక్తి గత అనుభూతికి చెందింది. మతం విభేదాన్ని సృష్టిస్తుంది, సత్యాన్ని మరుగు పరుస్తుంది. సత్యానికి నమ్మకంతో పనిలేదు. నమ్మకం లేందే మతం లేదు. మతం నమ్మకం ద్వారా మనుష్యుల్ని విభజన చేస్తోంది. కక్షలు కార్పణ్యాలు సృష్టిస్తోంది. మతానికొక దేవుణ్ణి పెట్టుకొని, ఎవర్ని ఆరాధించినా ఒకే దేవుడికి చెందుతుందనుకోవడం ఆత్మతృప్తి మాత్రమే. విభేధాన్ని తృంచి వేయలేదు.

మతం వ్యవస్థీకృతమై, బహిరంగ ప్రజాజీవితంలో ఒక ప్రచారాంశంగా మారి, రాజకీయ ప్రాబల్యం చెంది, ప్రాపగాండకు సోపానమై, అకృత్యాలకు పాల్పడు తున్నది. రక్తసిక్తంచేసి ప్రాణాలను బలిగొంటున్నది. బ్రతుకులను భయకంపితం చేస్తున్న మతతత్వాన్ని ఖండించాల్సిన అవసరం గుర్తించాలి. మతాన్ని వదిలితేగాని మత ఛాందసం పోదు. మత మౌఢ్యమూ, మతోన్మాదమూ, మత జాడ్యమూ, మత సంకుచితమూ, మతాన్ని అనుసరించడం నుండే పుట్టాయి.

**మతసామరస్యం :**

ఎవరి మతాన్ని వారు అంటి పెట్టుకొని వుండి మతసామరస్యం వుందని అనుకోవడం ఆత్మవంచన. నిర్నిరోధంగా సమగ్రతనూ, సామరస్యాన్నీ కల్గించే అంశాలు మతంలో లేవు. మతంలో పెట్టుకొనే నమ్మకమూ, అగుపించని అంతర్లీన వ్యక్తిగత లబ్ధి సమభావనకు విచ్ఛిన్నకరమైన అంశాలు. అందుచే సామరస్యం చేకూరదు.

భిన్నత్వం వల్ల సమగ్రతరాదు.

ఒకే వేదికమీద అన్నిరకాల ప్రార్థనలూ చేసినంత మాత్రాన అది సామర్యం కాదు. స్వార్థాన్ని పెంచుకోవడానికి చేసుకొనే సర్దుబాటు మాత్రమే. స్వార్థం ఎప్పుడూ ఏకత్వానికి భంగకరమైంది. భిన్నత్వంలో ఏకత్వం అనేది ఒక ప్రాపగాండా. వాస్తవం కాదు. మోసపూరితమైంది. వంకాయలూ, బెండకాయలూ, మామిడికాయలూ, మిరపకాయలూ భిన్నమైనవి కావచ్చు. వాటన్నిటిని ఒకచోట పెడితే కొట్టుకు చావవు. భౌతిక మైన వ్యత్యాసాలు సంఘర్షణ కలిగించవు. మానసికమైన విభజనలు ఘర్షణకు మూలకందాలు. అందుచే మతాలున్నంత వరకూ మతసామర్యం కల్ల. సమగ్రత ఉన్నదనుకోవడం కల, భ్రాంతి.

**సమన్వయం :**

సాంప్రదాయక మతాలకు పట్టులేకుండా పోవాలంటే, మతాన్ని ప్రభుత్వం గుర్తించకుండా, పాటించకుండా వుండాలి. దాన్ని వ్యక్తిగతంగానే పరిమితంచేయాలి. ప్రచారానికి అవకాశం ఇవ్వకూడదు. ప్రభుత్వం ఒకే సివిల్ కోడు కలిగి వుండడం మంచిది. ప్రభుత్వ ప్రోత్సాహంతో లేక రాజకీయ ప్రోత్సాహంతో లేక పార్టీప్రోత్స హంతో ఆలయ మసీదులు పడగొట్టడంగానీ, పునర్నిర్మించడం గానీ లేకుండా చూసు కోవాలి.

**ముగింపు :**

మతంలో సత్యం లేదనీ, సత్యం గ్రహించడానికి మతం అవరోధమనీ గ్రహించడం సత్యం. ఈ సత్యాన్ని అనుభూతి చెందడంతో సంప్రదాయక మతం బలహీనమైపోతుంది. అపుడు మతభావం ప్రజాజీవితాన్ని బహిరంగంగా కట్టిపడవేయదు. మతస్వేచ్ఛ పొందిన మనసు యదార్థాన్ని యథాతథంగా గుర్తించగలదు.

# 8.క్రొత్తమిలీనయంలో క్రొత్తదనం కృష్ణమూర్తి

మహాత్ములు పుడుతున్నారు, పోతున్నారు. కాని మనిషి మారడం లేదు. కృష్ణమూర్తి విషయంలో కూడ అంతే జరగవచ్చు. అయితే ఆయన అపురూపమైన, అపూర్వమైన, అతికొత్తదైన వినూత్న తత్వం ఆవిష్కరించారు. అందుకొనగలవారు నిజంగా కొత్తవారై పోతారు. కొత్త మనసుతో నిండిపోతారు. ఆయన జీవిత విశేషాలు కొన్ని ఇప్పటికే మీ ముందుంచాను. వారి తాత్విక విశేషాలు ఇక తెలుసుకుందాం.

జ్ఞానాన్ని ఆరాధించడం గురువులకు ఆచారమైంది. ఎంత విషయం సేకరిస్తే అంతజ్ఞానవంతుడంటున్నారు. శాస్త్ర విషయాలూ కంప్యూటర్ లాగ బుర్ర కెక్కించుకొని, అదే జ్ఞానమనుకొని, వల్లివేయడం అలవాటైపోయింది. జ్ఞాన సమాచారం సత్యదర్శనానికి అవరోధమని జె.కె.తేల్చారు. ఋజుమార్గానికి వలసింది అవగాహన. అవగాహన క్రియాశీలకమైంది. ఏ విషయమైనా సత్యమనేది -అర్థంకావడమో కాకపోవడమో ఉంటుందిగాని మరోమార్గం లేదు. తెలిసిన క్షణమే ఆచరణాత్మకత కాకపోతే, సాధన అనే భ్రమలు కల్పిస్తుంది.

భావజనితాలైన కులం, మతం ఎలా విద్రోహాలు సృష్టిస్తున్నాయో, జాతీయతకూడ యుద్ధాలు తెచ్చి పెడుతున్నది. మనిషిలో ఉండే అంతర్గత ఘర్షణలు, అత్యాశలు, విభజనలు, అభిప్రాయాలు బహిర్గత ప్రపంచంలో కార్య రూపందాల్చి ఘర్షణలు, దుఃఖాలు, పోరులు కల్గిస్తున్నాయి. మనిషిని బట్టే ప్రపంచం. కనుక మనిషి మారితే గాని ప్రపంచం మారదు. మనిషి మారాలంటే మానసిక విప్లవం సంభవించాలి. గతాన్ని వర్జించాలి, సంప్రదాయాన్ని బ్రద్దలు చేయాలి, గ్రంధాల మీద గురువులమీద గురితొలగాలి. తెలియనటువంటి లేక తాను సృష్టించుకున్న దేవుని మీద ఆధారపడడం మానాలి. తన నిజస్వరూపం తనకు క్షుణ్ణంగా తెలియాలి. తనకు తాను ప్రక్షాళనం కావాలి. ఏ క్షణానికి ఆక్షణం ఎరుక గల్గి ఉండాలి. భూత భవిష్యత్తులు వర్తమాన జీవితానకి అవరోధాలు కారాదు. ఎరుకే ధ్యానం, అది నిరంతరం కొనసాగాలి. అదే కొత్తమనసు. అపుడుగాని నిజమైన ప్రేమ జనించదు. సరిగ్గా నడిపించే తెలివి పుట్టదు. పరివర్తన అలా జరగాలి. ర్యాడికల్ఛేంజ్‌రావాలి - సరిక్రొత్త మార్పు రావాలి.

మనసు, మెదడు, వాటిపనితనం లోలోతుగా కృష్ణజీ పరిశీలించారు. అంతర్దృష్టి తోను స్వానుభవంతోనూ గడించిన వివరాలు సైంటిస్టుల ముందు పెట్టారు. కంప్యూటర్ లాగ మానువునికున్న ఒకే ఒక పరికరమైన మనసు ఎలా యాంత్రికమౌతోందో, ఎలా భ్రష్టుపడుతోందో, ఎలా నిస్త్రాణ మౌతుందో దార్శనికునివలె హెచ్చరించారు. సిద్ధాంతాలు, ఆదర్శాలు వాస్తవాలు కావు, అవి అభిప్రాయాలు మాత్రమే. అవి భవిష్యత్తును చూపిస్తాయి. మనిషి జీవించేది వర్తమానంలో గనుక అవివర్తించవు. ఆలోచనయొక్క పరిమితులను నిగ్గదీశారు. ఆలోచన ఎప్పుడూ గతానిదే. అది చింతాక్రాంతం. సైన్సుపరంగా, నిత్యనిర్వహణలో అది పనిచేయవచ్చు. కాని అది ఊహాత్మకం. ఆలోచన కల్మష భూయిష్టమైంది. ధనం, అధికారం - భార్యపై భర్త

శిష్యునిపై గురువు, అనుయాయులపై నాయకుడు చలాయించే అధికారాల్తో సహా - ఎక్కడ విజృంభిస్తాయో అక్కడ క్రూరత్వం తప్పదన్నారు. పోటీలను, పోలికలను, పరీక్షలను నిరసించారు; అవి చేసేహాని వివరించారు.

జిడ్డు కృష్ణమూర్తి లాగ ప్రకృతికి సన్నిహితంగా, సున్నితంగా, స్పందనగా బతకగల్గినపుడు పర్యావరణ పరిరక్షణ దానంతటి కదే సిద్ధిస్తుంది. సంపూర్ణమైన స్వేచ్ఛకు నిదర్శనమూ, ప్రేమకు ప్రతిరూపమూ, తెలివికి నికేతనమూ వారి జీవితం. ఒక బుద్ధుని తర్వాత ఒక కృష్ణమూర్తి పుట్టారు. కాకపోతే గత మహనీయుల బోధలు కల్తీ అయిపోయాయి. కృష్ణమూర్తి మాటలు కల్తీకాలేదు. మానవుని సమస్యలన్నిటినీ స్పృశించారు. మూలం కనుగొన్నారు. సమస్యలోనే సమాధానం జూపారు. కొత్తమిలీనియంలో కొత్తదనం చవిచూడాలంటే కృష్ణమూర్తే దిక్కు, మార్గదర్శకం

25-12-2000

## 10. నేటి సమస్యలకు మేటి సమాధానం కృష్ణమూర్తి

తాత్వికులు ప్రపంచాన్ని విశ్లేషించారుగాని పరిష్కారం చూపలేదని కారల్ మార్క్స్ చెప్పారు. తాను ఆర్థిక తాత్విక స్థాయిలో చర్చించారు. సమాధానం చూపారు. అది రష్యాలో విఫలమయింది. ప్రపంచదేశాలలో మార్క్స్ ప్రభావం లేకపోలేదు. కాని సమస్యలు తీరలేదు. ఆర్థిక రాజకీయ రంగాలను ప్రభావితం చేసినంతగా మానసిక క్షేత్రాన్ని మార్క్స్ చైతన్య పరచలేదు. అందుచే తగినంత ప్రభావం లేకపోయింది. అనుసరించడంలోనే లోపముందిగాని, సిద్ధాంతంలో లోపం లేదని సమాధాన పరిచే వారున్నారు. ఈ మాట ప్రతివేదాంతీ అంటూనే వుంటాడు. మానవజీవితానికీ, ప్రపంచానికీ ప్రేరకమైన, మూలమైన మానసికవైఖరిని పూర్తిగా, వాస్తవాలతో సమన్వయం చేసుకోకుండా ఏ సిద్ధాంతం ప్రచారం చేసినా సత్ఫలితాన్నివ్వజాలదు. అంతేకాదు, మానసిక మార్పుకు కాలవ్యవధి (సాధన) అంగీకరించడం వల్ల కూడా అనర్థం వాటిల్లింది. మానసిక క్షేత్రాన్ని మొత్తం ఒకనాడు తన గుప్పిట్లో పెట్టుకున్నాడు బుద్ధుడు. అలాగే సంపూర్ణావగాహన జెందిన వాడు ఈనాడు కృష్ణమూర్తి.

"మనో పుబ్బంగమా ధమ్మామనోసేట్ఠామనోమయా" - ధర్మా (కర్మ)లన్నిటికి మనస్సే మూలం, మనస్సే శ్రేష్ఠం, ఆచరణలన్నీ మనసుద్వారానే - అని బుద్ధుడు కనుగొన్నాడు. ఇది 'ధమ్మపద'లో మొదటిపాళి పదం. అలా కనిపెట్టిన గౌతముడు సర్వజ్ఞుడు, సర్వశ్రేష్ఠుడు, సర్వం జయించినవాడు, బుద్ధుడు అయినాడు. దేశంలోనేగాక, ఆసియా మొత్తంలోనూ, నూతన ధార్మిక ఒరవడి సృష్టించాడు. వ్యక్తిలోను, సమాజంలోను, దేశంలోను శాంతి సామరస్యాలను, సమత్వదృష్టిని కల్గించాడు. ఆ తర్వాత వచ్చిన తత్వవేత్తలు, మతప్రవక్తలు అంత విశాల దృష్టి చూపలేకపోయారు. బహుశ వారి అనుయాయుల్లో ధర్మదృష్టికన్నా మతదృష్టి ఎక్కువ కావడం కారణం కావచ్చు.

బుద్ధునిలా స్వచ్ఛందమైన, స్వచ్ఛమైన మరోవ్యక్తి, మనిషి కృష్ణమూర్తి. బుద్ధుని తర్వాత దాదాపు 2450 సంవత్సరాలకు పుట్టారు. ఆయనకు మనసే ప్రధానం. మనసులోతులు చూశారు. అందర్దృష్టి పొందారు. తన్ను తాను పూర్తిగా అవగాహన జేసుకున్నారు. వాస్తవాలను గుర్తించారు. ముసుగులన్నీ తొలగించారు. దేశీయతను (జాతిని) కూడ నిరసించారు. మానవతను మేల్కొల్పారు. నిజమైన విశ్వమానవు డయ్యారు. అన్ని సమస్యలకు మూలమైన మానసిక ఘర్షణను తొలగించుకొన్నారు. మానవాళి దుఃఖనివృత్తికి తాను తోడ్పడ్డారు. సమస్యమూలాలను చూశారు. సరియైన అవగాహనతో తక్షణ మార్పు కోరారు. కాలం, ఆలోచన, సాధన, సర్దుబాటు అనువాటికి అవకాశం ఇవ్వకుండా మనిషిలో ర్యాడికల్ (మౌళిక) తక్షణ మార్పు రావాలని, మెదడులో మ్యూటేషన్ (పరివర్తన) జరగాలని సూచించారు. మానసిక విప్లవం తోనే సామాజిక విప్లవం రావాలని కోరారు. శ్రద్ధ, సావధానత, ఎరుక, ధ్యానం, తెలివి, ప్రేమ, సమత వుండాలని ప్రవచించారు. విజ్ఞాన శాస్త్రానికి, తార్కికతకు, హేతుబద్ధతకు అనుగుణ్యంగా జీవిత వికాసమును చూపారు. అయితే జీవితం హేతువుతోను, సైన్సుతోను సంపూర్ణత చెందదని హెచ్చరించారు.

ఏ రంగంలో చూచిన విభజన, స్వార్థంచోటు చేసుకుని వుండడం వల్ల సమస్యలు ఉత్పన్నమవుతున్నాయని చెప్పారు. కనుక అవిభాజ్యమైన జీవన వైఖరి పూనాలని ప్రబోధించారు. సంప్రదాయం, గతం, మతమూర్ఖత్వం, జాతి వివక్షత, సిద్ధాంత ఛాందసం, వ్యక్తిపూజ, హింసాప్రవృత్తి దేనినీ అంగీకరించలేదు. మతంగాని, ఆదర్శంగాని ఏదీ

వ్యవస్థీకృతం కాకూడదని హెచ్చరిక జేశారు. సిద్ధాంతనమ్మకం కూడ మతవిశ్వాసం లాంటిదేనని కరాకండికగా తెల్పారు. మనసు దేనికీ కండిషన్ పరిమితం కాగూడని తేల్చారు. సంపూర్ణ స్వేచ్ఛయే సంపూర్ణ వికాసానికి తార్కాణమని చెప్పారు. నేటి ఘర్షణలను, యుద్ధాలను, రాజకీయ వత్తిళ్ళను, సామాజిక అవినీతిని ముందుగనే గమనించి, నిఘావేసి చూపారు. మనిషి మతానికో, సిద్ధాంతానికో, ఆదర్శానికో, దైవానికో బలికావడాన్ని ఆయన అంగీక రించలేదు. రేపటి మేలుకై నేడు హతం కావడం అర్థరహిత మన్నారు. ఉన్నతమైన వ్యక్తులద్వారా ఉన్నతమైన సమాజం ఏర్పడాలన్నారు. నేటి సమాజంలో అవినీతి అంతర్లీనంగా ఉండి, వినాశానికి దారితీస్తుందని చెప్పారు. మత గురువులను, బాబాలను, దైవపురుషులను, ఆధ్యాత్మిక శాస్త్రాలను అంగీకరించలేదు. అవగాహన వల్ల మార్పు వస్తుందన్నారు. విద్యద్వారా మార్పు తేవాలన్నారు. ఆయన చెప్పిన విషయాల్లోను, నడిచినతీరులోను ఎక్కడా వైరుధ్యం కానరాలేదు. అది ఆయనలో నున్న గొప్ప విశేషం.

12-5-02

## 11. ద్రష్ట దృశ్యం ఒకటైనవాడు

అతని చూపే ఒక అనుభూతి. అతని పలుకే ఒక వాస్తవం. అతని ఉనికే ఒక ప్రసన్నత. అతని నడకే ప్రకృతి తాదాత్మ్యం. అతని సన్నిధి ఒక స్పందన, ఒక మెలకువ, ఒక తేజం. ప్రశ్న - పరిశీలన - స్వచ్ఛందత - హేతుత్వం - సత్యార్థం - అన్యత్వం - అనన్యత్వం - బుద్ధికుశలత - ధీశక్తి - ప్రజ్ఞ - ప్రేమ - గుణాత్మక విశేషాలతో అనునిత్యం ఆవిష్కరణమైన అచ్చం మానవతా మూర్తి, అతడే మన జిడ్డు కృష్ణమూర్తి.

ప్రాథమిక విద్యాభ్యాస కాలంలోనే అతను పరధ్యానంగా ఉండేవాడు. ప్రకృతి పరిశీలనలో నిమగ్నమయ్యేవాడు. తమ్ముడైన నిత్యానంద చేయిపట్టి నడిపేవాడు. క్లాసులో పాఠాలు చెబుంటే తాను బయటే నిలబడేవాడు. ఉపాధ్యాయుని చేత దెబ్బలు తినేవాడు. అతడొక అమాయకబాలుడొకడు. తల్లి ప్రేమలో తొణికిసలాడి నాడేమో, తన పదవయేట తల్లిగతించిన పిదపకూడ, తల్లి గురించిన కలలు, భ్రాంతులు, స్పందనలు పొందుచుండేవాడు.

కృష్ణమూర్తికి అంతర్మథనం ఆరంభమైంది. దివ్యజ్ఞానం అతనికి ఒంటబట్టలేదు. సంప్రదాయం చేదుగా అనిపించిందతనికి. సంఘాలలో కన్పించేవన్నీ ఆడంబరాలుగా, భ్రాంతులుగాతోచాయి. సభ్యులలో నిజాయితీ లేకపోగా, గొప్పెదాటు మనస్తత్వముందని గ్రహించాడు. అతని మనస్సు అంతర్ముఖమై తన్నుతాను ఆవిష్కరించుకోవడం మొదలు పెట్టింది. ఆంతరికంగా ప్రక్షాళనా క్రియజరగసాగింది. 1922 ఆగస్టు 17న కృష్ణమూర్తికి ప్రక్షాళనా వేదనానుభూతి తీవ్రస్థాయికి వెళ్లింది. అలాధ్యానం - అర్ధ అపస్మారకస్థితి - వెన్నుతలమెడలో బాధ - వణుకు - మూలుగు - పళ్లబిగింపు - అలుపు - సణుగుడు - అరుపు - శాంతి - చైతన్యం. నిబ్బరం - ధ్వనికి బెదరడం - దుమ్ము ధూళి దులపమనడం - ఏవనాంతాలకు వెళ్లాలనడం - కాస్త అయోమయం మున్నగు చేష్టలు పరివర్తనా ప్రక్రియలో కలగలుపుగాను, విడివిడగాను మూడు రోజులపాటు బాగా సంభవించాయి. నాల్గవ రోజున ఒకపెప్పర్ చెట్టు క్రిందికి వెళ్లాడు. ధ్యానమగ్నుడైనాడు. శ్లోకాల వలె లాగా ఏమేమో ఉచ్ఛరించాడు. మౌనం వహించాడు. గాఢానుభూతికి లోనయ్యాడు. బోధివృక్షం క్రింద బుద్ధుడు సమ్యక్ సంబోధి చెందినట్లు కృష్ణమూర్తి పెప్పర్ వృక్షం క్రింద స్వేచ్ఛా చైతన్య స్ఫూర్తిని పొందాడు. ద్రష్ట - దర్శనం దృశ్యంలో కృష్ణమూర్తి ఏకమయ్యాయి "... నాకు దాహం తీరింది... వెలుగు జూశాను ... దుఃఖ నివారణమైన కరుణ స్పృశించాను... ప్రపంచానికి సత్యదర్శనమైంది.... ప్రేమతో నా హృదయం మత్తెక్కింది.. నా అంతరంగం శక్తితో నిండింది.. నా మిత్రుల జీవితాల మార్పుకు, ప్రపంచం పురోగతికి సాయపడతాను.... " అని మిత్రులకు వివరించాడు. అప్పటినుండీ అతన్ని మిత్రులు 'కృష్ణజీ' అని గౌరవప్రదంగా పిలువసాగారు. ఆ యనుభూతిలో భాగంగా గొడ్డలి - నరికేవాడు, దృశ్యం - చూచేవాడు ఒక్కటేనన్న భావన గాఢంగా కల్గింది, అలాదర్శనం అయింది.

ఆలోచన నాగరికతను నిర్మించినట్లు దేవుణ్ణి కూడ సృష్టించింది. మతం మనిషినిగా బ్రతక కుండా చేస్తుంది, మనుషుల్ని విభజిస్తుంది. జ్ఞానం జ్ఞాపకాలపుట్ట. శాస్త్ర సాంకేతిక జ్ఞానం భౌతిక జీవనానికవసరం. మానసిక జ్ఞానం నిబద్ధిస్తుంది, స్వేచ్ఛను హరిస్తుంది. అను నిత్యావగాహన క్రియాశీలకమైంది. భయముంటే ప్రేమలేదు. ప్రేమలేని జ్ఞానం వినాశకరం. ఆలోచనే కాలం. అది గతనికి సంబంధించింది. మానసిక మార్పుకు కాలంతో పనిలేదు, సాధన అవసరంలేదు. జీవించడమంటే వర్తమానమే. జీవించడంలో మరణించడముంది. మానసిక సంపాదనను ఎప్పటి కప్పుడు

విస్మరించడమే మరణించడం. మనసును డొల్లచేయడమే ధ్యానం. అది నిరంతరం ఉండేది. దానికి టెక్నిక్‌తో పనిలేదు. ధ్యానంలో ఏకాగ్రతకన్నా సావధానత మిన్న. అందుకు ఆసక్తి శ్రద్ధ అవసరం. "నేను" లేని చూపే అసలు చూపు. 'నేను' అనేది సంబంధాలకు, అవగాహనకు, ఆత్మీయతకు. అనురాగానికి, అనన్యత్వానికి అవరోధం. మార్పు, స్వేచ్ఛ, ఎరుక తెలివి, ప్రేమం, లోచూపు, పరిశీలన, ప్రకృతి తాదాత్మ్యం అనవరతం జీవనావసరాలని తెలియ జెప్పాడు.

"జీవితపు టెడారిలో కృష్ణమూర్తి ఒక జలాశయం"

ఒక వస్తువును భౌతికంగా చూడడం వుంది. ఒక విషయాన్ని మానసికంగా దర్శించడం వుంది. ఈ ప్రక్రియలో చూసేది, చూడబడేది ఉన్నాయి. అవి ద్రష్ట, దృశ్యం. ఆరెండూ ఒకటైనపుడు, ఏకత్వం - అఖండత్వం - అద్వైతం - అవిభాజ్యత సిద్ధిస్తుంది. భౌతికంగా వస్తువు వేరుగా కన్పించవచ్చు. మానసికంగా, అనుభూతిపరంగా వేరుభావన లేని స్థితి వుంది. వేరు బావన కల్గించేది నేను - ఆలోచన - జ్ఞానం - సమాచారం - స్మృతి. 'నేను' చూడడం వుంది. 'నేను' లేకుండా చూడడం ఉంది; అపుడు చూపు మాత్రమే ఉంటుంది; వస్తువు లేక బావన వేరైందిగా తోచదు. రెండూ ఒకటైపోతాయి. ద్రష్ట, దృశ్యం ఏకం. ఇది సర్వసమ్మేళనం, సర్వసంధానం, సర్వసమగ్రత, ఇందులో ఏకాగ్రతలేదు, అనేకాగ్రత లేదు, త్యజించడం లేదు, నిరోధించడం లేదు. అన్నీ ఒకటైనప్పుడు, దేన్నీ వదలడమంటూ లేదు. ప్రతిఒక్కదానికి వేరైన స్థితి ఉండవచ్చు. అన్నీ కలిసినపుడు, అన్నిటికీ మించిన స్థితి ఉండవచ్చు. ఆ స్థితి అతీతమైంది కావచ్చు, కాలా ప్రమేయం లేంది కావచ్చు, అనన్యస్థితి కావచ్చు, అద్భుతానందం కావచ్చు, అమృతత్వం కావచ్చు, అవర్ణనీయం కావచ్చు. ప్రసన్నత, ప్రశాంతత అంటే అదే - సర్వేంద్రియ గుణాభాసం - సర్వేంద్రియ వివర్జితం. అట్టి స్థితిగల పురుషుడు శాంత స్వరూపుడు, ప్రసన్నుడు, పరమానందుడు, స్థితప్రజ్ఞుడు, ప్రేమాస్పదుడు అవుతాడు. కృష్ణమూర్తి అలాంటివాడు. అయితే ఆ స్థితి రంగులా, స్థిరంగా, శాస్వతంగా పట్టుబడి, కట్టుబడి ఉండదు. క్షణకాలంపాటు కలుగుతుంది. అది ఎప్పటికప్పుడు, క్షణక్షణం జరగాలంటారు కృష్ణమూర్తి. ద్రష్ట - దృష్టి ఏకమైందంటారు కృష్ణమూర్తి.

ఆ స్థితిలాంటి మరొకస్థితి అపుడపుడు సామాన్యమానవులకు కలుగుతుంది. దేనియందైన సంపూర్ణాసక్తి ఉన్నపుడులేక తదేక దృష్టిలో ఉన్నపుడు, లేక అత్యంతాసక్తిలో

గాని మత్తులోగాని ఉన్నపుడు ఏర్పడవచ్చు. మనసులేని, ఆలోచనలేని స్థితి అది. 'నేను' లేదు. గుణంలోను, స్వభావంలోను తేడా ఉండవచ్చు. స్వల్పమైన స్థితిగాని, అల్పమైన స్థితిగాని ఉదాత్తమైన స్థితిగాని మానవునికి సంభవించే అవకాశం ఉంది. ఇది గ్రహించవలెను.

## 12. ఆధ్యాత్మిక వ్యాపారాన్ని అరికట్టిన కృష్ణమూర్తి

ఆధ్యాత్మిక వ్యాపారాన్ని ఎండగట్టి వాస్తవికత వైపు దృష్టి మళ్లించిన ఆదునిక తత్వవేత్త జిడ్డుకృష్ణమూర్తి. మతం పేరిట జరిగే మోసాన్ని ఆనాడే బహిరంగపరచి జీవిత ఔన్నత్యాన్ని విస్పష్టం చేశారు. సమాజం సంక్షోభమయమై మతమౌఢ్యం వ్యాపిస్తుతన్న నేటితరుణంలో జిడ్డు కృష్ణమూర్తి బోధనలు పరిశీలించడం చాలాఅవసరం. జిడ్డు కృష్ణమూర్తిని అభిమానంగా కృష్ణజీ అని పిలిచేవారు.

కృష్ణమూర్తి, ఐరోపా, అమెరికాలో గొప్ప గొప్ప మిత్రబృందాల మధ్య చాలా హాయిగా, ఆనందంగా పాతికేళ్ళ పైబడి గడిపారు. స్వతంత్రంగా ఆలోచించడం ఆరంభించారు. తీవ్రమైన ఆత్మమథనం చెందారు. దివ్యజ్ఞాన సమాజ విషయాలు కాని, సంప్రదాయ వేదాంత విషయాలు కాని, వివిధ మత విషయాలు కాని ఏమాత్రం అతనికి పట్టలేదు. అయితే బుద్ధునియందు అత్యంత అభిమానం చూపించేవారు.

కృష్ణజీ పూర్తిగా మార్పుచెందారు. సంస్థలు, మతాలు, ఆస్తులు, సిద్ధాంతాలు వ్యక్తియొక్క సంపూర్ణ మానవతా వికాసానికి ఆటంకాలని ప్రకటించారు. విశ్వ మానవుడుగా, నిత్యదార్శ నికుడుగా, సతత వాస్తవికుడుగా, తత్వ బోధకుడుగా, పరమ కరుణాళువుగా 60 ఏళ్ళకు పైబడి ప్రపంచంలో తిరిగారు. విద్యావిషయక మైన నవీనత్వం, చైతన్యవంతమైన స్వేచ్ఛా వాతావరవణం విద్యార్థులలో ప్రవేశ పెట్టారు.

కృష్ణమూర్తి తత్వంలో వున్న నవ్యత, నాణ్యత ఏమిటి? సంప్రదాయబద్ధమైన భక్తి - వేదాంత ధోరణుల నుంచి ఎలా వేరైనారు? ఇవి పరిశీలనాత్మక అంశాలు. ఈ దేవుణ్ణి సృష్టించింది కూడా మానవుని ఆలోచనే అని కృష్ణమూర్తి అంటారు. దేవునికి ఆలయాలు, ఆరాధనలు కల్పించింది ఆలోచనయే. దేవుని పేర సంక్షోభాలు తెచ్చి పెట్టిందీ ఆలోచనయే. దేవుడున్నాడనడమూ తెలియనితనమే, లేడనడమూ తెలియని

తనమే. ఉన్నాడా, లేడా అనే ప్రశ్నకు సమాధానం చెప్పుకోవలసింది నీవే, నీ పరిశోధనే. ఇతరులెవ్వరూ కాదు, ఏ గ్రంథాలూ కాదు. నమ్మి వెదికితే, నీ నమ్మకమే అవరోధం అవుతుంది. దేనికీ కట్టుబడకుండా, ఏ విధంగా నిబద్ధం కాకుండా, ఎలాంటి ముసుగూ, మానసిక బానిసత్వం లేకుండా ఎవరికి వారు పరిశోధించుకుంటే ఎవరికి వారికి తెలియవచ్చును. అంతకుమించి మార్గం లేదు. "నేనసలు దేనినీ నమ్మను. నమ్మకం చాలా ప్రమాదకరమైంది. సూర్యుడుద యిస్తున్నాడనేది నమ్మకం కాదు. వాస్తవం" అని చెప్పారు. అందుచే ఈ లోకంలో దైవం చుట్టూ పెనవేసుకున్న ఆలయాలు, ఆర్భాటాలూ, వ్యవహారాలు, వ్యాపారాలు ఆగిపోతాయి గదా!

మతం గురువులకు గుత్తాధిపత్యాన్ని ఇచ్చిందని, స్వార్థానికి మూఢత్వానికి నిలయమైపోయిందని కృష్ణజీ అంటారు. నిజమైన మతం పరిశోధనాత్మకంగా వుండాలని అంటారు. ఆదర్శం అవాస్తవం; ఉన్నస్థితిని వదిలి కాబోయే స్థితిని పట్టుకున్నట్టు భ్రమపడడం జరుగుతుంది. హింసను గుర్తించడం, గుర్తించడంతో వదిలించుకోవడం ప్రధానంకాని, అహింస ఆదర్శాన్ని జపించడంలో ప్రయోజనం లేదని కృష్ణజీ స్పష్టం జేశారు. ఆశ్రమ స్థాపనలో బ్రతుకుతెరువు చూసుకోవడం, ఆస్తిని పెంచుకోవడం, అధికారం కూడబెట్టుకోవడం, స్వయం రక్షణ ఏర్పరచు కోవడం జరుగుతుంది. నిజమైన ఆధ్యాత్మికతకు ఆశ్రమం ఆసరా కాదు. ఆశ్రమాలలో ఆధ్యాత్మిక ఆదర్శం అనేది దైవంస్థానంలో వుండడం, దానిచుట్టూ భక్తసమూహాలు చేరడం, ఆధ్యాత్మిక వారసత్వం కొనసాగడం జరుగుతోంది.

జ్ఞానాన్ని ఆరాధించడం మనుషులకు అలవాటయింది. జ్ఞానం సర్వకర్మలను దగ్ధం చేస్తుందని చెప్పారు. కర్మకన్నా జ్ఞానం గొప్పదన్నారు. జ్ఞానం వినా మోక్షం లేదన్నారు. సంపాదించి నిల్వచేసుకున్నదే కదా జ్ఞానం అని చెప్పారు కృష్ణజీ. ధన సంపాదన ఎలాంటిదో జ్ఞాన సంపాదన అలాంటిదే. జ్ఞానం కలవారే కదా విభేదాలు సృష్టించింది సమాజంలో. జ్ఞానం కలవారే కదా జ్ఞానం లేనివారిని దోచుకుంటున్నది. జ్ఞానం కలవారే కదా గర్వంతో ఉబ్బిపోతున్నది. జ్ఞానం మనసులో ఒక బరువు, ఒక అవరోధం, ఒక మత్తు, ఒక బంధం. అందుకనే సన్యాసమిచ్చేటప్పుడు జ్ఞానాన్ని కూడా త్యాగం చేయమంటారు. దాని వాసన కూడ వదిలించు కోమంటారు. జ్ఞానం గతానికి సంబంధించినదయితే, అవగాహన వర్తమానానికి సంబంధించినది. క్రియ జరిగేది అవగాహన వల్లనే, అవగాహనే క్రియ అని కృష్ణజీ చెబుతారు.

కృష్ణజీ జీవిత వాస్తవికతను చూపించారు. జీవిత ఔన్నత్యాన్ని నిరూపించారు. 'ఆధ్యాత్మికత' పేరుతో ముసురుకున్న భ్రమలను పటాపంచలు చేశారు. మానవత్వంతో మహోన్నత వ్యక్తిలా, సుకుమార సుగంధ మరంద కుసుమంలా పుష్పించారనడంలో అతిశయోక్తి లేదు.

11-5-1996

# 13. తాత్విక స్పందనం - మానవతా నందనం

**వినూత్న అంతఃశీలన :**

భారతీయ వేదాంత తత్వధోరణిలో మూడు విషయాలు స్పష్టంగా ఉంటాయి.

**i) నేను ఆత్మను**

ఏదో అనంతశక్తి - అతీతశక్తి - ఆత్మ - పరమాత్మ పేరుతో సాగుతూ ఉంటుంది. అదే నేను, లేక అందులో భాగం నేను అనుకోడం, దానితో తాదాత్మ్యం పొందినట్లు కనిపించడం, ఒకవిధమైన తృప్తి, అనుభూతి పొందడం - ఇది చాలా వరకు బుద్ధిపరంగా జరుగుతుంది, ఒక తీవ్రమానసిక వాతావరణం సృష్టిస్తుంది.

**ii) మోక్షమే గమ్యం**

మోక్షం, జన్మరాహిత్యం వెంట బడడం. పుణ్య సాధన, స్వర్గసుఖం, ఉత్తమ జన్మ, ఆముష్మిక సుఖం - ఇవన్నీ మనిషిని కాంక్ష - ఆశ - అత్యాశ - ఆదుర్దా వైపుకు నెట్టివేస్తుంటాయి. మానవుని వ్యక్తిగత స్వార్థ పరత్వం, సంకుచితత్వం ఇందులో ప్రోది చేసుకుంటాయి. సొంత సాధనలో ఎవరికి వారే, ఎవరి సుఖం వారిదే అన్న వైఖరి కన్పడుతుంది. అవి సమాజగతం అయ్యే సరిగి లేక వ్యవస్థీకృతం అయ్యే సరికి వర్గ స్వార్థం పెరుగుతోంది. మనుషులు విభజనకు గురి అవుతూ, శాఖోపశాఖలై విడిపోతున్నారు.

**iii) వ్యవస్థీకృతసాధన**

వ్యక్తిగత విశ్వాసాన్ని సంఘీభూతం చేసినట్లో లేక విస్తృత పరచినట్లో వ్యవహరించడం. ఇందులో వ్యాపారించడం జరుగుతోంది. ఒక వ్యక్తి తాను నమ్మి సత్యమనుకొన్నదాన్ని పదిమంది నెత్తిపై రుద్దుతున్నాడు. ఒక సంస్థనో లేక ఒకసాధికారిక

కార్యక్రమాన్నో నిర్మిస్తున్నాడు. అది సమాజ హితానికనో, విశ్వశాంతికనో ప్రకటిస్తున్నాడు. వ్యవహారంలో వ్యాపారం చోటు చేసుకొంటోంది. డబ్బుతో వ్యాపారం చేసినా భక్తితో వ్యాపారం చేసినా ఆధ్యాత్మిక భావంతో వ్యాపారం చేసినా వ్యాపారం వ్యాపారమే; దాని ప్రభావం మనసు మీద ఒకటే. పేరుకు పదిమందిని జేర్చడం జరుగుతుంది. అనుచరుల్ని పెంచడం అవుతుంది. ఓటు బలం పొందడం కుదురుతుంది. కాని దానివెనక, ఉద్దేశంలోపల స్వార్థం - అధికారం - సంపాదన - ప్రతిష్ఠ - మూకబలం - అహంకారం - పనిచేస్తుంటాయి. ప్రజలు పావులుగా ఉపయోగపడతారు. యజ్ఞ యాగాలు, జ్ఞానయజ్ఞాలు, గురుపీఠాలు, ఈ కోవకు చెందినవే.

మూఢత్వానికి దారి

ఈ మూడు ధోరణులు వ్యక్తినీ, సమాజాన్నీ బంధించి వేస్తున్నాయి. నమ్మకం చాటున మౌఢ్యాన్ని పోషిస్తున్నాయి. జ్ఞానం పేరుతో అస్వతంత్రతనూ పెంచుతున్నాయి. సిద్ధాంతం పేరుతో అనాలోచిత వైఖరి ప్రోత్సహిస్తున్నాయి. వైజ్ఞానిక దృక్పథానికి విఘాతం కల్పిస్తున్నాయి. విడ్డూరమైంది ఏమంటే, వైజ్ఞానిక అవసరాలను కూడ వాడుకొని, మౌఢ్యాన్ని పటుతరం చేయడం. మౌఢ్యం యాంత్రికాభివృద్ధి చెందుతోంది. ఈ విధగా అధునాతన యుగంలో వేదాంత ప్రచారం జరుగుతోంది, భారతీయ తాత్విక చింతన పాతముసుగునే తళతళలాడే టట్లు చేస్తోంది.

కృష్ణమూర్తి ఎలా ఎదిగారు?

సహజంగా కృష్ణమూర్తి చిన్నప్పుడు సంప్రదాయ రీతుల్లో పెరిగారు. దివ్యజ్ఞాన వ్యవహారాల్లో చిక్కుకున్నారు. అతీంద్రియ శక్తుల మాయల్లో పడ్డారు. బాల్యంలోనే పెద్ద పెద్ద అంతర్జాతీయ ఆధ్యాత్మిక సంస్థలకు అధినేత అయ్యారు. మిలియన్ల విలువగల ఆస్తులకు సొంతదారు అయ్యారు. ఇక గొప్పఅవతార పురుషుని స్థాయికి ఎదిగారు. కాని ఏదో లోనదాగిన వివేకం, వాటితో సమాధానపడలేదు, వాటన్నిటినీ ఎదరించింది.

కృష్ణమూర్తి పైన పేర్కొన్న మూడు దృక్పథాలను నిశితంగా పరిశీలించారు, సునిశితంగా చూశారు, లోతుగా ప్రశ్నించారు, అడుగంటా పరిశోధించారు. మూడు **దృక్పథాలంటే -అతీత శక్తి(ఆత్మ)లో నమ్మకం, మోక్షాపేక్ష, వ్యవస్థాగత ఆరాధన -జ్ఞానార్జన - ప్రచారం.**

i) అతీతశక్తులను, అనంత శక్తులను ఆయన నేరుగా కాదనలేదు. ఆశక్తి ఫలానిది అనిగానీ, అది ఉంది నమ్మమని గాని చెప్పలేదు. దాన్ని నిర్వచించి నిర్ధారించలేదు, దానికి నామకరణ చేయలేదు. దాని పట్ల తనకుండే అనుభూతులను ఆదర్శంగా పెట్టలేదు. మనల్ని అనుసరించమనలేదు. ఎవరి అనుభూతినీ తార్కాణంగా తీసుకోమనలేదు. జీవితావగాహనలో అది ఎంత మేరకుందో లేదో ఎవరికి వార్ని చూసుకోమన్నారు. దాని అవసరానవసారలపట్ల మనసుంటే ఎవరికి వార్ని చూసుకోమన్నారు. పరిశీలనలో స్వచ్ఛందంగా - స్వతంత్రంగా - స్వేచ్ఛగా - దేనికీ కట్టుబడకుండా - నిర్నిబద్ధంగా - గతవాసనలూ, ఊహాపోహలూ లేకుండా ఉండమన్నారు.

అయితే మానవతాశక్తిని మహోన్నతంగా అనుభూతి చేసుకోవడంలో ఏమాత్రం అలసత్వానికి, అలక్ష్యానికి అవకాశమిడలేదు. అవగాహనా కృషి నిర్విరామంగా సాగాలన్నారు.

**'ఆత్మ' ఒక పెద్ద అడ్డంకి**

ఆత్మ ఉందా లేదా పరమాత్మ ఉన్నాడా లేడా అనే సమస్యను మానవుడు నిష్కారణంగా తనకు తాను సృష్టించుకుంటున్నాడు. అందులోబడి సతమతమవుతున్నాడు. వర్తమానంలో శక్తివంతంగా జీవించడాన్ని కోల్పోతున్నాడు. వ్యక్తిత్వ వికాసంతో, ధార్మికంగా, చైతన్యవంతంగా, స్వేచ్ఛగా, ప్రేమగా జీవించడానికి ఈ అనవసరపు సమస్య అడ్డం వస్తోంది. పోనీ పరిశీలించుకోవాలనుకుంటే నిష్పక్షపాతంగా నిత్య జీవితంలో ఎంపిక లేని ఎరుకతో గమనించుకోవడంలో అర్థం వుంది. ఇదీ కృష్ణజీ దృక్పథం.

కృష్ణమూర్తి "ఆత్మ" ను, "పరమాత్మ"ను అంగీకరించలేదు. ఉపనిషత్ "బ్రహ్మ"పై ఆధారపడలేదు. మనిషి తనకు మించిన శక్తితో ఉన్నతీకరించుకోవాలనుకుంటాడు. ఒక ఆదర్శంతో తాదాత్మ్యం చెందాలనుకుంటాడు. ఆశక్తిని తాను వాస్తవంగా గుర్తించి కాదు; ఎవరో, ఏ గ్రంథమో చెప్పగా దాన్ని నమ్మి లేక ఊహించి దానికి చెందాలనో, దాన్ని పొందాలనో ప్రాకులాడుతాడు. దానికి ఆత్మ అనో లేక పరమాత్మ అనో పేరు పెడతాడు. దానికి శాశ్వతత్వం ఆపాదిస్తాడు. అదీ తానూ ఒకటనుకుంటాడు. ఒకటి కావడానికి తంతు, తంత్రం, సాధన చేకూర్చుకుంటాడు.

తాను వేరైపోయినట్లూ, దివ్యాత్మ స్వరూపుడైనట్లూ పదే పదే తపిస్తుంటాడు, జీపిస్తుంటాడు. అంతేగాని దాన్ని తానుగా పరిశీలించి నిర్ధారించు కోవడంగానీ, వాస్తవజీవితంలో ఆవిష్కరించుకోవడం గానీ, చేయడు. పోనీ తాను కానిదాన్ని వదిలిపెట్టడు. ఇలా స్వార్థబుద్ధితో భ్రమలో పడి కొట్టుమిట్టాడు తుంటాడు. ఇలా వాస్తవమూ, యదార్థమూ చూడడం కృష్ణమూర్తి ప్రత్యేకత.

**మానసిక చెరనుండి బయట పడాలి**

ii) "ఆధ్యాత్మిక" రంగంలో ఆశలవెంటబడడం అనర్థ దాయకం - అది మోక్షం కానివ్వండి, స్వర్గం కానివ్వండి. ఇది చిత్త ప్రవృత్తి ప్రేరణ, సంకల్ప ప్రభావం. అందులో ఎంత అహంభావన, బంధం చేరి ఉంటాయో లోతులకు వెళ్లితే గాని తెలియదు. మోక్షమనీ, జన్మరాహిత్యమనీ ఊదరగొట్టడం సుతారాం ఆయనకు గిట్టదు. ఈలోక బంధాలను వదిలి, పర్వతాలకో, పరలోకాలకో వెళ్లడాన్ని ప్రోత్సహించలేదు. ఈ దేహాన్ని వదిలి యోగ సిద్ధిపొందడమో, "పరమాత్మ" లో లయంగావడమో ఆయన సూచించే మార్గం కాదు. శాంతి చాటున పనిచేసే "ఆధ్యాత్మిక" సుఖలాలసతకు చాలా దూరంగా ఉంటారు.

అయితే ఆశాపాశబంధాల నుండి విముక్తి కమ్మంటారు. గత వాసనల నుంచి తొలగమంటారు. అన్ని మానసిక బంధాలనుంచీ స్వేచ్ఛ పొందమంటారు. అవాస్తవాలనుంచి దూరం కమ్మంటారు. నమ్మకాల భ్రమల్లో చిక్కుకోవద్దంటారు. ఎంపిక లేని ఎరుక, నిత్య జాగృతి, సంపూర్ణ స్వేచ్ఛగా ఆయన పట్ల గలవని చెప్పుకోవచ్చు.

మోక్షాపేక్షలో ఆశాబద్ధత, స్వార్థపరత ఇమిడి ఉన్నాయి. పుణ్యార్జన - స్వర్గం - ఉత్తమ జన్మం - జన్మరాహిత్యం - ఇదీ మోక్షానికి మెట్లక్రమమంటున్నారు. మూసలో ఇమిడ్చి, బంధించి, రెచ్చగొట్టి, దురాశ జూపి, తమపబ్బం గడుపు కొంటున్నారు కొందరు గురువులు. ఈ వాతావరణం గాలిలా వ్యాపిస్తోంది. నమ్మకాలు, సాధనలు, సత్సంగాలు ఉచ్చులై పనిచేస్తున్నాయి.

**ఊహ మోక్షం కాదు**

భారతీయ సంప్రదాయంలో మోక్షాసక్తి హెచ్చుగా చోటు చేసుకొని ఉంది. కృష్ణజీ దాన్నుండి బయట పడ్డారు. మోక్షం పేరుతో చేసే సాధనలు అర్థం లేనివని గ్రహించారు. అవి భ్రమింపజేస్తాయని గుర్తించారు. సంప్రదాయంలో ఊహించిన

సాధనా ఫలాలు పొందినట్లే భావిస్తూ, వాటితో తదాత్మ్యం చెందటానికి యత్నిస్తారు. తెలియకుండా జరిగే ఈ మానసిక ప్రక్రియ వల్ల నిజంగా తమకు లేని స్థితి వచ్చినట్లుగా వ్యవహరిస్తారు. అహింసా భావాన్ని పెంచుకుంటారు. అలాంటి అవాస్తవిక గుర్తింపు సంఘర్షణ సృష్టించడమే కాకుండా, నిజమైన వికాసానికి ఒకచోట చిక్కుకుపోయినా, స్వేచ్ఛ కోల్పోయినా ఒక్క అడుగు ముందుకేసేది ఉండదు, సాధించేదీ ఉండదు.

### మోక్షం గూర్చి అభిప్రాయాలు

మోక్షమంటే జీవాత్మ పరమాత్మలో లయం కావడం, జన్మరాహిత్యం చెందడం, భవబంధాలనుండి తొలగడం, పరమాత్మ తనకు సర్వాధీశుడనే సేవకబావంలో సముత్తీర్ణతతో జీవించడం, లేక తాను పరమాత్మ యొక్క అంశమని గుర్తించడం లేక తానే పరమాత్మ అనే సంపూర్ణావగాహన కలగడం; సత్యం - శివం - సుందరం అనే భగవద్గుణాలను పుష్కలంగాకలిగి ఉండడం ; ఈ లోక బంధాలనుంచీ, సంబంధాల నుంచీ పూర్తిగా నిర్లిప్తంగావడం - ఇలా అనేక విధాలుగా చెప్పబడింది. ఇది ఒక గజిబిజి. లేదా మేథస్సుకు తృప్తినిచ్చే భావజాలం.

### కృష్ణజీ లిబరేషన్

కృష్ణజీ టీచింగ్‌లోని లిబరేషన్ అనేపదంలో మోక్షం, ముక్తి, విముక్తి జ్ఞానోదయం, ఫ్రీడం అనే వాటి సమానార్థాలు ఇమిడి ఉన్నాయి. మనిషి తన బంధాల నుండి బయట పడడం విముక్తి లేక లిబరేషన్. బంధాలు మానసికంగా ఉంటాయి, భౌతికంగా ఉంటాయి. బాండేజెస్, అటాచ్‌మెంట్స్ - అన్నీ తొలగాలి. అలాగే సంకెళ్ళలా పట్టి, బంధించే నమ్మకాలనుండీ విడవడాలి. వెంటాడే ఆశాపాశాలు అంతం కావాలి. సంఘర్షణలు సుదూరం కావాలి. గతవిస్మరణ అవసం. ఈర్ష్యా భయద్వేషాలు అణగారాలి. తెలిసిన దాన్నుండి స్వేచ్ఛ పొందాలి. ఇదీ కృష్ణజీ బావంలో లిబరేషన్ లేక మోక్షం లేక స్వేచ్ఛ.

### తానంటే ఎవరు ?

తన్ను తాను తెలుసుకోవడమే జ్ఞానోదయం లేక రియలైజేషన్. తానంటే

చిన్న ఆత్మా, పెద్ద ఆత్మాకాదు; తాను అంటే తన ఉనికి యావత్తూ, తన మనోభావాలు యావత్తూ, తన ఫీలింగ్స్, వైఖరి, పోకడలు యావత్తూ, తన శరీరం - మనసు - హృదయం మొత్తంగా తన ఎరుకలో ఉండడం. తాను తన సంపూర్ణ ఎరుకలో ఉండడం రియలైజేషన్. దానివల్ల సూక్ష్మత, సౌకుమార్యత, ప్రజ్ఞ, ప్రవర్తన, పరివర్తన, ప్రేమ ఏర్పడతాయి.

దీన్ని ఆధ్యాత్మికత్వం అనేకంటే అంతరంగికతత్వం అనాలి. ఇది నిరంతరం నిలవాలి.

iii) ఇక వ్యవస్థీకృత సాధన

**గుంపులు -గురువులు**

ప్రస్తుత సమాజంలో సామూహిక ఆధ్యాత్మిక సాధన బాగా ప్రచారంలో ఉంది. అది బాగా పనిచేస్తుందని అనిపిస్తోంది. ఇంది కండబలాన్నీ, మొండి బలాన్నీ, ఓటు బలాన్నీ ఇస్తోంది. పేరు, కీర్తి, డబ్బు తెచ్చిపెడుతోంది. మఠాలు పెట్టుకొని, పెంచుకొని, రాజకీయంలోకి ప్రవేశిస్తోంది. దౌర్జన్యం, హింస చెలరేపుతున్నాయి. వినోద పరిశ్రమలాగా ఆధ్యాత్మిక వ్యాపారం - వ్యవహారం విపరీతంగా సాగుతోంది. సంస్థలపేర, సంఘాలపేర, సమాజాలపేర, మఠాలపేర, ఆశ్రమాలపేర, సాధనపేర, ఆరాధన పేర, ధ్యానంపేర, మతంపేర, అవతారంపేర, యజ్ఞాల పేర, యాగాల పేర జరుగుతున్నదంతా ఇదే. ఒక నమ్మకం వ్యవస్థీకృతమై సామూహిక ప్రయోజనానికి పాటుపడుతోంది. ఇది కామనేగాని ప్రేమాసక్తికాదు, ప్రచారమే (ప్రాపగాండ) గాని, ప్రబోధం (టీచింగ్) కాదు, భ్రమేగాని వాస్తవం కాదు.

**నమ్మకం ప్రమాదకరం**

దీనికి కృష్ణజీ పరిష్కారమేమంటే, అసలు నమ్మకమే ప్రమాదభరిత మన్నారు. వాస్తవం చూడగల వానికి నమ్మకంతో పనిలేదన్నారు. నమ్మకం సంస్థాగతం కారాదు, కాకూడదు, కాలేదు అని తేల్చారు. గురువు చుట్టూగాని, ఆధ్యాత్మిక భావం చుట్టూగానీ, విశ్వాసం చుట్టూగాని, అనుభవం చుట్టూగానీ, సిద్ధాంతం చుట్టూగానీ, మహాత్ముల చుట్టూగాని, అతీంద్రియశక్తిచుట్టూగానీ సంఘాలు పెట్టరాదు, సంస్థలు కొనసాగరాదు. అధికారం చుట్టూ డబ్బు చేరుతుంది, డబ్బు చుట్టూ అధికారం చేరుతుంది. అది

ఆధ్యాత్మికత పేరుతో కానివ్వండి, మరోపేరుతో కానివ్వండి. డబ్బూఅధికారం ఎక్కడపెనవేసుకొని ఉంటాయో అక్కడ పతనం తప్పదు. ఆయన అందుచే ప్రచారమే ఒక అబద్ధమన్నారు. ఎలాంటి సంఘాలనూ, సంస్థలనూ ఆయన ప్రోత్సహించలేదు. వంశానుగతంగా గానీ, పారం పర్యంగాగానే ఎంతటి ఉన్నత భావానికైనా పీఠం వేయరాదన్నారు. ఆధ్యాత్మిక పీఠాలు, మత పీఠాలూ, స్వార్థానికీ, వంచనకూ నెలవులవుతాయని హెచ్చరించారు.

### జ్ఞానం వ్యక్తిగతం

జ్ఞానోదయం, మోక్షంలాంటివి వ్యక్తిగతమైనవేగాని సామూహిక మైనవి కాదు. ఇది కృష్ణజీ ప్రబోధాల్లో స్పష్టంగా కనబడుతోంది. వ్యష్ఠి, సమష్టి గురించి మానవుడు తీసుకొనే నిర్ణయాల లోతుపాతులు వ్యక్తికే అవగాహన అవుతాయి. ఒక అవగాహనతో వ్యక్తి తీసుకొనే నిర్ణయాలు అతనికే పూర్తిగా వర్తిస్తాయి. ఆ నిర్ణయాలు ఇతరులకు కూడ వర్తించవచ్చును, ఎప్పుడు? అలాంటి అవగాహన ఇతరులకు కూడ స్వయం సిద్ధంగా కల్గినపుడు. అవగాహన పొందే కృషి వ్యక్తి చేయాలి. కాబట్టి ఇక్కడ వ్యక్తికున్న ప్రాధాన్యత అమోఘమైంది.

### కృష్ణమూర్తి పొందిన దేమిటీ?

ఏతావాతా తేలిందేమంటే కృష్ణమూర్తి పొందిన తాత్విక స్పందన మానవత్వపు పుష్టీకరణతోనూ, ఫలదీకరణతోను కూడింది. భారతీయ తాత్వికతకు తన జీవితంలో వినూత్న భాష్యం వ్రాశారు. ఆ మొత్తం అంతఃపరిశీలనా విస్ఫోటక మైంది. అద్భుతమైంది, అపురూపమైంది. అంతర్బాహిరాలకు ఆధారమైంది. అదే మానవతా నందనం.

# 14. సంపూర్ణ మానవుడు కృష్ణమూర్తి

20 వ శతాబ్దంలో మనమొక సంపూర్ణంగా వికసించిన మానవున్ని చూశాం. అంతకు ముందటికాలంలో కూడా అనేక మంది ఇలాంటి పూర్ణపురుషు లుద యించారు. కాని వారిని మనం ప్రత్యక్షంగా దర్శించలేకపోయాం. కేవలం ఊహించు కొని తృప్తి పడుతున్నాం. ఎక్కువగా నమ్ముతున్నాం. చారిత్రకంగా మనం బుద్ధుని ఎరుగుదుము. రాజ్యం త్యజించి, సర్వసంగపరిత్యాగియై, రావిచెట్టు క్రింద మహాబోధి

నొందాడు. "సర్వజ్ఞుడై"నాడు. ప్రజ్ఞలో కరుణలో సమపాళ్లతో పదహారు కళల సంపూర్ణ చంద్రునివలె భాసించాడు. కృష్ణమూర్తి యీా మహాత్యాగి. పెప్పర్ వృక్షం క్రింద సంపూర్ణ వికాసం చెందాడు. నిండైన స్వేచ్ఛతో అవగాహనతో పరిపూర్ణచైతన్య వంతుడైనాడు. సమోన్నత ప్రేమను, తెలివిని స్పృశించాడు. కృష్ణమూర్తిలో మనం ఆ పూర్ణత్వాన్ని ప్రత్యక్షంగా చూస్తున్నాం. ఊహించుకోనవసరం లేదు.

మనసు లోలోతులను ఆవిష్కరించినవారు కృష్ణమూర్తి. దాని సత్యాలను సుస్పష్టంగా వివరించి తెలిపారు. వారిలో ప్రేమ కరుణలు పూర్ణంగా వికసించి ఉన్నాయి. ఇతరుల దుఃఖాన్ని దూరం చేయటానికే వారు తమ జీవితాంతం కృషి చేశారు.

మనిషి జీవితం ఎంత సంక్లిష్టంగా మారిందో, మనుషులు దానిని ఎంత అయోమయంగా మార్చుకున్నారో కృష్ణమూర్తి విశ్లేషించి చూపుతారు. ఈ సంక్లిష్టత - అయోమయం నుండి తక్షణం బయట పడమంటారు. అప్పుడే సంపూర్ణత సిద్ధిస్తుందంటారు.

జీవితం - మరణం వేరు వేరుకావంటారు. మరణంతో జీవించమంటారు. గతస్మృతులను విస్మరించాలని, భవిష్యత్ కలలు మానాలని, వర్తమానంలో జీవించటం నేర్చుకోవాలని కృష్ణమూర్తి నొక్కి చెబుతారు. క్షణం క్షణం జరిగే మార్పే మరణం అంటారు. గతస్మృతి విస్మరణయే మరణమంటారు. ఇలా మరణాన్ని అర్థం చేసుకొంటే, మనిషి వెంటనే భయం నుండి బయట పడతాడంటారు.

"జీవితం వాస్తవం". దాన్ని తెలుసుకోవాలి" అంటారు కృష్ణమూర్తి. "దీనికి ఏ గురువూ, ఏ శాస్త్రం సహాయపడవని ఎవరి జీవితాన్ని వారే స్వయంగా తెలుసుకోవాలని" చెబుతారు.

# 15. కృష్ణమూర్తి - మార్మతత్వం

### కృష్ణమూర్తిని తెలుసుకోవటం

జిడ్డుకృష్ణమూర్తిని గూర్చి చెప్పటం, వ్యాఖ్యానించడం చాలా కష్టమైన పని. ఒక అనుభూతిని, ఒక భావాన్ని సంపూర్తిగా వ్యక్తీకరించడానికి ఎవరికీ మాటలు సరిపోవు. ఇక ఇతరుల జీవితాలు - మనోవైఖరి గూర్చి చెప్పడం అంత సులభమా? కృష్ణమూర్తిని ముఖాముఖి తెలిసికోవడం ఉత్తమ మార్గం అందుకనువుగా ఆయన రచనలు,

ప్రసంగాలు, ఆడియో క్యాసెట్లు, వీడియో క్యాసెట్లు యధాతథంగా ఉన్నాయి. తద్వారా కొంతవరకు అర్థం కాగలరు. నిజంగా అర్థం కావడానికి ఎంతో శ్రద్ధ, మరింత కృషి అవసరం. శబ్దపరంగా అర్థం చేసుకోవడానికి పుస్తకాలు, ప్రసంగాలు సరిపోతాయి. అర్థవంతంగా జీవించాలంటే ఎవరికి వారే తమను తెలుసుకోవాలి. అందుకు కృష్ణమూర్తి ఒక అద్దంలా ఉపయోగపడతారు.

**వినటం**

ఒకరిని గూర్చి చెప్పవలసి వచ్చినపుడు చెప్పేవాని మనస్తత్వం కొద్దిగానైనా విషయంలో ప్రవేశిస్తుంటుంది. అలా జరగకుండా చూసుకోడానికి ఎంతో నిజాయితీ, అవగాహన అవసరం. అలాగే వినేవాడు జాగ్రత్త పడాలి. సాధారణంగా ఒకరిని వ్యాఖ్యానించడంగానీ విశ్లేషించడంగాని ఎందుకు జరుగుతుంటుంది? తనకనువుగా మార్చుకోవడానికి లేక తగదని నెట్టివేయుడానికి. కృష్ణమూర్తి ఈ రెండూ చేయవద్దంటారు. అవుననక, కాదనక, అంగీకరించక, నిరసించక, మెచ్చుకోక - నొచ్చుకోక, అనుకరించక - ఆరాధించక, పోల్చక ప్రామాణిక మనక శ్రద్ధ గావినమంటారు, మనోహృదయ దేహాలతో వినమంటారు.

**మానసిక మార్పు**

పరిశీలన వేరు, విశ్లేషణవేరు. విరోధమూ, నిరోధమూ, నిర్బంధమూ, నిబద్ధతా లేకుండా గమనించ మంటారు. జరగవలసిన మానసిక ప్రక్రియను మార్పును సహజంగా జరగనీయమంటారు. అది తగిన క్రియకు దారితీస్తుం దంటారు. లేక అది తక్షణం క్రియాత్మక మవుతుందంటారు. క్రియ వేరు ప్రతి క్రియ వేరు. క్రియాత్మకమైన (ఆ) మార్పు నిలబడుతుంది, నీ దవుతుంది, నిజమవుతుంది, సహేతుకమవుతుంది, నెమ్మదిస్తుంది, ప్రభావితం చేస్తుంది. ఇది ప్రాథమిక విప్లవం; మానసికమైంది. సంపూర్ణమైన మార్పు ఇక్కడ మొదలవ్వాలి.

**కృష్ణమూర్తి మాటలు - పుస్తకాలు**

అందుకే మొదటి నుంచీ స్వేచ్ఛ కావాలంటారు. 'First step is the last step'. దాని వివరం 'First and the last freedom' అనే గ్రంథంలో లోతుగా ఉంది. 'Freedom from the known' అనే చిన్న గ్రంథంలో టైటిల్ విషయం

పరిశీలనాత్మకంగా వుంటుంది. Tradition and Revolution అనేదాంట్లో The only Revolution అంటే ఏమిటో రేఖా మాత్రంగా వుంటుంది. ఇంకా గాఢంగా "The Awakening of intelligence" లో వుంది. 'Krishnamurti notes' లో మనసు అంచుల్లో, మనసుకు అవల ఏముంటుందో దాని ఛాయలు, ఆయన వ్యక్తిగత అనుభవాలు వుంటాయి. కొన్ని అనుభవాల లోతులు అందవు. 'Commentaries on living' మూడు భాగాలలో అనుభూతులు, చర్చలు, గోష్టులు వివిధ జీవితాంశాలపై వుంటాయి, వివిధ వ్యక్తులతో వుంటాయి. విశేషంగా, పిన్ పాయింటెడ్‌గా వుంటాయి. "Questions & Answers" లోనూ "This matter of Culture" లోనూ బహువిషయాలపై ప్రశ్నోత్తరాలున్నాయి. Education పై రెండు గ్రంథాలు, లేఖలు ఉన్నాయి. ఇంకా, ఇంకా.....

**నువ్వే ప్రపంచం**

కృష్ణమూర్తి వ్యక్తికీ, మనసుకూ ప్రాధాన్యతనిస్తారు. వ్యక్తిలో మార్పు విప్లవాత్మకం కావాలి. అది సమాజంలో మార్పు తెస్తుంది. వ్యక్తిలేనిదే సమాజంలేదు. వ్యక్తిలోని సమస్యలే సమాజంలో ఉన్నాయి. నీవేమిటో ఈ సమాజమది. నీవు సృష్టించినవే సమాజంలోని సమస్యలు 'You are the world' అంటారు. నీలోపల ఏముందో అదే ప్రపంచంలో బహిర్గత మౌతోంది. కాబట్టి విప్లవం నీలో పుట్టాలి. అది నీ గమనికలో జరగాలి, స్వచ్ఛందంగా జరగాలి, సహజంగా జరగాలి, అంతరంగంలో జరగాలి. నీకు నువ్వేసాక్షివి కావాలి.

**సంస్థ ఒక బంధికాన**

అలాగే సంస్థ కొరకు పాటు పడడం అనే దానిలోని ఆంతర్యాన్ని ఆయన ప్రశ్నిస్తారు. సంస్థ నీకొరకు ఏర్పడింది. సంస్థ కొరకు నీవుకాదు. సంస్థే ప్రధాన మయితే అది నిన్ను బంధిస్తుంది. దేని కొరకు సంస్థ పెట్టావో అది మృగ్యమైపోతుంది. సంస్థను నిలపడానికి హింసకు పాల్పడ వలసి వస్తోంది. హింస ప్రతిహింసకు దారితీస్తుంది. ఈ సంస్థపోయి, మరో సస్థ పుడుతుంది. సమస్య మరో రూపంలో కొనసాగుతుంది. ఇక్కడ సంస్థ అంటే ఆధ్యాత్మికమైన, లేక సిద్ధాంతపరమైన, లేక ఒక అథారిటీకి లోనైన (అథారిటీని నిలబెట్టే ప్రాధాన్యత గల), ఆనువంశికమైన అని అర్థం. భౌతిక నిర్వహణ ప్రధానమైన పుస్తకాల షాపులు పాఠశాలలు కావు.

### కృష్ణమూర్తి ఎవరు?

కృష్ణమూర్తిని ఆధ్యాత్మిక పురుషుడందామా, వేదాంతి అందమా, మానసిక శాస్త్రవేత్త అందామా, హేతువాది అందామా, భౌతిక విజ్ఞాని అందామా, అద్వైతి అందామా, విప్లవవాది అందామా, నాస్తికుడందామా, ఎగ్నాస్టిక్ అందామా? అలా అయితే ఏదో ఒక గూటిలో ఆయన్ని బంధించే ప్రయత్నమవుతుంది. ఆయన సమగ్రంగా, నిర్ద్వంద్వంగా, నిస్సంక్లిష్టంగా, విప్లవాత్మకంగా, సంపూర్ణ స్వేచ్ఛా జీవిలా కనిపిస్తారు. ఆయనొక కులస్థుడు కాదు, మతస్థుడూ కాదు, శాఖీయుడూకాదు, కులాల భారతీయుడూ కాదు. ఎవరి సిద్ధాంతమూ, ఎవరిజీవితమూ ఆయనకు ఆరాధ్యంకాదు, ఆదర్శంకాదు. ఆయన ఒక మనిషి - ఒక విశ్వవీరుడు - వసుధైక కుటుంబమూర్తి. ఒక స్వేచ్ఛా కుసుమంలా వికసించాడు.

### కృష్ణమూర్తి - కమ్యూనిజం

ఇకపోతే కృష్ణమూర్తి దృష్టిలో మార్క్సిజం ఏమిటో చూద్దాం. ఆయన రెడ్‌బ్లడ్ కమ్యూనిష్టులతో సన్నిహిత స్నేహం నెరిపారు. చాలా మంది వారితో చర్చించారు. చర్చల అనంతరం మిత్రులైన కమ్యూనిష్టులూ వున్నారు.

ప్రపంచ యుద్ధం సంభవించినపుడు, ఆయన యుద్ధంలో చేరాలని అనుకున్నా చేరలేక పోయారు. బీభత్సాన్ని సహించకలేక ఒంటరి జీవితం గడిపారు. ఇంగ్లాండును, అమెరికాను సమర్థించలేదు. విమర్శించారు కూడా. జర్మనుల పట్ల వాదపరమైన సానుభూతి చూపారు. రష్యనుల పట్ల వుదాసీనత వహించి నట్లున్నారు. ఆర్థిక విప్లవానికి వ్యతిరేకి కాదు. కాని మార్క్సిజం, సిద్ధాంత పరంగా, మానవుని వికాసాన్ని బంధించి వేస్తోందని అభిప్రాయ పడ్డారు.

ఐరోపాలో ఒకసారి కవి రాబిన్‌సన్ జాఫర్సన్, స్టీఫన్‌సన్ దంపతులు, రోమ్‌లాండా, కృష్ణజీని కలిసి చర్చించారు. వాళ్లలో రాటుతేలిన కమ్యూనిష్టులున్నారు. శ్రీమతి జెఫర్‌సన్ కృష్ణజీలో వెలుగు చూసింది. "నిజమైన సందేశానికి సచిత్ర నిరూపణమే కృష్ణజీ. అతడు బాగా మాట్లాడాడా లేదా అనేది నాకు ప్రధానం కాదు - ఎక్కువ మాటలు లేక పోయినా అతని ప్రభావాన్ని గుర్తిస్తున్నాను. అతని మాటల్లో అందం ఆనందం యధార్థం వున్నాయి" ఇది జెఫర్‌సన్ అనుభూతి.

**సత్యం ఎలా ఎక్కడ లభిస్తుంది**

కృష్ణజీ చెప్పిన దాని సారాంశం: "సత్యమనేది గతానుభవాలతో పొందేది కాదు. జ్ఞాపకాల భారం తగ్గినపుడు మాత్రమే మనసు సత్యాన్ని గ్రహించగలరు. నిత్య జాగరూకతయే సత్యం. అనగా క్షణం క్షణం చైతన్య వంతంగా జీవించాలి. సత్యానికై అన్వేషించవద్దు.... పుస్తకాల నుండి విషయ పరిజ్ఞానం, సాంకేతిక నైపుణ్యం పొందవచ్చు గాని సత్యాన్ని, సౌఖ్యాన్ని పొందలేం. జీవించడం ద్వారా మీకై మీరు వాటిని పొందగలరు. ఇతరుల జీవితాల నుంచి గ్రహించలేరు..."

**తిండి కావాలంటే...**

"మీరు సైకాలజీ గూర్చి, మనసు యొక్క అంతర ప్రక్రియ గూర్చి చెప్పేదంతా దండగ" అని వేరేచోట ఒకరు చర్చలో చెప్పారు. "మనుషులకు పని, తిండి కావాలి. ఆర్థిక పరిస్థితిని ఎదుర్కోవలసి వుండగా, వేరే చెప్పడం వల్ల మీరు ప్రజల్ని కావాలని ప్రక్కదారిపట్టించడం కాదా? ....కడుపు నిండకుండా నీవేమీ ఆలోచించలేవు, చేయలేవు"అన్నాడు ఆ పృచ్ఛకుడు.

"గడవడానికి కడుపులో ఏదో ఒకటి పడాల్సిందే. అందరికీ తిండుండాలంటే మన ఆలోచనా విధానాలలో మౌలికమైన విప్లవం రావాలి. అందుకే చిత్త ప్రవృత్తిని ఎదుర్కోవాల్సిన ప్రాముఖ్యత కనిపిస్తోంది. మీకు ఆహారం ఉత్పత్తి చేయడం కన్నా సిద్ధాంతం అత్యధిక ప్రాముఖ్యమైంది. బీదల కడుపు నింపాలని మీరు మాట్లాడొచ్చు. కానిదానికంటే అభిప్రాయంలోనూ, సిద్ధాంతంలోనూ మీకు పట్టింపు ఎక్కువ కదా?" అని కృష్ణమూర్తి అన్నారు.

**మా సిద్ధాంతమే నిజమైన మార్గం**

"అవును, మనుషుల్ని కలపడానికి సిద్ధాంతం కావాలి, తద్వారా సమైక్య పోరాటం జరుగుతుంది. అభిప్రాయం లేకుండా, పథకం లేకుండా కలిసి పనిచేయడమేలా?" అని విమర్శకుడు అడిగాడు.

"కాబట్టి మెదడు మానసిక విషయాలు (అంటే సిద్ధాంతం) పట్టుకోవడం ద్వారా, క్రియ అనుసరిస్తుందంటారు. 'కనుక మానసిక విషయాలు గూర్చి మాట్లాడడం ప్రజల్ని తప్పుదారి పట్టించడమ'ని మీ ఉద్దేశం కాదన్నమాట. మీ ఉద్దేశమేమంటే మీవద్ద సహేతుక

సిద్ధాంతం వుంది.దానిని, మించిపోవడం వృధా అని. దాని నుండీ తొలకుండా వుంటే వర్గ రహిత సమాజం ఏర్పడి, అందరికీ పనిలభిస్తుందంటారు."

- కృష్ణమూర్తి

"మా సిద్ధాంతం వాస్తవాలమీద, చరిత్ర మీద ఆధారపడింది. మతమౌఢ్యం మీద నమ్మకాలు మీద కాదు. దృశ్యాలతో, భ్రమలతో కూడింది కాదు".

- విమర్శకుడు

**సిద్ధాంతాలు పోట్లాడుకుంటే**

"వ్యవస్థీకృత మతాలు కూడా చరిత్ర మీద, ప్రబోధకుల అనుభవాల మీద ఆధారపడినవే కదా! మీది ఒక అనుభవం మీద, వాళ్లదిమరో అనుభవం మీద. కొద్ది మార్పుండొచ్చు. కాని ఇరువురూ సిద్ధాంతం మీదే, సామూహిక క్రియ ఉత్పన్న మవుతుందంటారు. ఒకరి అనుభవాన్ని ఒకరు అంగీకరించరు. ఇద్దరూ సిద్ధాంతాలకు ప్రాముఖ్యతనిచ్చి కొట్టుకుంటారు. సిద్ధాంతాలు యుద్ధం చేస్తుండగా మనిషి మరుగున పడిపోయాడు."

-కృష్ణమూర్తి

"మనిషిని రక్షించడానికి మనిషి మరుగున పడ్డాడు. భవిష్యత్ మానవుని రక్షించడానికి వర్తమాన మానవుని త్యాగం చేస్తున్నాం"

- విమర్శకుడు

"భవిష్యత్ కొరకు వర్తమానాన్ని ముంచేస్తున్నారు. దేవుడి పేరుతో చర్చి సర్వాధిపత్యాన్ని కాంక్షిస్తున్నట్లు, రాష్ట్రం పేరుతో మీరు సర్వాధిపత్యాన్ని వాంఛిస్తున్నారు. ఎవరి దేవుళ్లు వారికి, ఎవరి పవిత్ర గ్రంథాలు వారికున్నాయి. వాటిని వ్యాఖ్యానించడానికి తగిన వ్యాఖ్యాన కర్తలు మతాధిపతులూ వున్నారు. మీ ఇద్దరి మధ్యా పెద్ద తేడా ఏమీ లేదు.ఇద్దరూ భవిష్యత్తు కొరకు వర్తమానాన్ని బలి ఇస్తున్నారు. భవిష్యత్ అంతా మీకు తెలిసినట్లూ -

భవిష్యత్ ఒక నిర్ణీత వస్తువైందా? దానిపై మీకు సర్వాదిపత్యం వున్నట్లూ'. అయినా ఇద్దరికీ ఇతరుల లాగానే రేపు ఆగమ్యమే. ఇద్దరూ ఒక బహుమతిని, ఒక ఊహా లోకాన్ని ఒక స్వర్గాన్ని హామీ ఇస్తున్నారు.కాని భవిష్యత్ అంటే సైద్ధాంతిక తీర్మానం

కాదు. అభిప్రాయాలు ఎప్పుడూ గతానికి భవిష్యత్తుకు సంబంధించి వుంటాయి. వర్తమానానికి కాదు. వర్తమానం గూర్చి ఉండాల్సింది అభిప్రాయంకాదు క్రియ. క్రియ అనేది వర్తమానంలో ఉండాలి. ఆదర్శవాది అనేవాడు గతానికో భవిష్యత్తుకో చెందుతాడు. వర్తమానంలో లేడు. గతం, భవ్యిత్తు అతనికి నిర్ణీతవిషయాలు. అవే అతని జీవితం. ఆ నిర్ణీత విషయాలు సాధించాలని ఏ మార్గమైనా పడతాడు. దానికి అడ్డం వస్తే దేనినైనా, ఎవరినైనా హతం చేస్తాడు''

\- కృష్ణమూర్తి.

అనుభవం, అభిప్రాయం లేకుండా క్రియజరగదని విమర్శకుడంటాడు, అనుభవం తర్వాతే క్రియ ఉంటుందంటాడు. దేని నుండి ఏది అనేది చర్చనీయాంశ మయింధి.

**అనుభవం విప్లవాత్మకం కాదు**

"ఒక టీచరు లేక విప్లవ రచయిత తన లేక ఇతరుల అధ్యయన అనుబంధాల ద్వారా సంపాదించిన జ్ఞానం, అనుభవం. జ్ఞానమే, లేక అనుభవం నుంచి అభిప్రాయాలేర్పడతాయి''. ఈ సైద్ధాంతిక తీర్మానంనుంచి క్రియ వెలువుడుతుందని విమర్శకుడన్నాడు. అది సరైన, సంపూర్ణమైన ప్రమాణం కాదంటారు కృష్ణమూర్తి. కలిసి మాట్లాడడం అనుభవం. అదిలోని చలనానికి స్పందన. ఛాలేంజికి స్పందించడం అనుభవం. ప్రేరణలు ఒక నేపథ్యం నుంచి వస్తాయి. స్పందనలు ఒక నిబద్ధత నుండి వస్తాయి. అనుభవం ఎప్పుడూ నిబద్ధమైంది, అలాగే అభిప్రాయం కూడనిబ్దదమైందే. అది పరిమితచర్యనిస్తుంది. అనుభవం, అభిప్రాయం ఇతరుల అనుభవంతోనూ, అభిప్రాయంతోనూ వ్యతిరేకించినపుడు సమన్వయం (Synthesis) ఏర్పడదు. ఇంకా వ్యతిరేకత తెచ్చి పెడుతుంది. వ్యతిరేకత లెప్పుడూ సమన్వయం ఇవ్వవు. వ్యతిరేకత లేనపుడే సమగ్రత (Integration) సాధ్యమవుతుంది. అభిప్రాయాలెప్పుడూ వ్యతిరేకతలు కొనితెస్తాయి. వ్యతిరేకతలు అభిప్రాయల మధ్య ఘర్షణ కలిగిస్తాయి. ఏ పరిస్థితుల్లోనూ ఘర్షణ సమన్వయం ఇవ్వదు.

"అనుభవం నేపథ్యం యొక్క స్పందన; స్పందన ఛాలెంజి నుద్దేశించి ఉంటుంది. నేపథ్యం గతం యొక్క ప్రభావం. గతమంటే స్మృతి. స్మృతి ఇచ్చే సమాధానం భావన లేక అభిప్రాయం. స్మృతి నుంచి నిర్మించినదే ఆదర్శం, సిద్ధాంతం. దాన్ని

అనుభవమనండి, జ్ఞాన మనండి. అది ఎన్నటికీ విప్లవాత్మకం కాదు. విప్లవం అనిపించుకున్నా గతం కుదించబడి కొనసాగడమే. ఏ సిద్ధాంతమైనా అది ఒక అభిప్రాయమే. మీ సిద్ధాంతం పరిమితం, పక్షపాతం, నిబద్ధితం. అది ఒక్కటే ప్రపంచాన్ని రక్షిస్తుందని చెప్తారు. మనం అలా సూత్రాలకూ, తీర్మానాలకు అలవాటుపడ్డాం. వాటిని అనుసరిస్తాం. దోచుకోబడతాం. దోచుకునే వాడూ దోచుకోబడతాడు."

## స్వేచ్ఛ కావాలంటే

అభిప్రాయం మీద ఆధారపడ్డ క్రియ బంధిస్తుంది గాని స్వేచ్ఛ నివ్వదు. నిబద్ధత నుండి తొలగడం అసాధ్య మంటాడు విమర్శకుడు. అది కూడ అభిప్రాయం, నమ్మకం, అదీ బంధీని చేస్తుందంటారు కృష్ణమూర్తి. "ఒకరు నమ్ముతారు, మరొకరు నమ్మరు. ఇద్దరూ వాళ్ల నమ్మకానికి బంధీలు. వాళ్ల నిబ్ధతను బట్టి, వాళ్ల అనుభవముంటుంది. స్వేచ్ఛ పొందాలంటే మొత్తం నిబ్ధతను, దాని ప్రభావ ప్రక్రియను పరిశోధించాలి. ఈ ప్రక్రియను అర్థం చేసుకోవడమనేది స్వయం జ్ఞానం (Self knowledge). తద్వారా బంధవిముక్తి అవుతుంది. ఈ స్వేచ్ఛ నమ్మకం నుంచీ, అన్ని సైద్ధాంతికాదర్శాలనుంచీ దూరంగా వుంటుంది" అని చెప్పారు.

## చిత్తవృత్తిలో మార్పురావాలి

గుర్తింపుగానీ అనుసరణగానీ - ఏసంస్థతోనైనా - అదొక శరణ్యాం, లాంటిది. సొంతానికి ఒక హక్కు. వాటివల్ల ప్రేమ పుట్టదు, స్వేచ్ఛ వుండదు సరికగా, సంఘర్షణ మిగుల్తుంది. మార్క్సిజం వర్గతత్వం గానీ హిందూయిజం వర్ణతత్వంగానీ మరో ఆదర్శపు సిద్ధాంతంగానీ మనిషిని (మానవత్వం నుంచి) మరొకతనిగా చేయాలని వత్తిడి చేస్తుంది. అంతర్గత విభేదానికీ, ఘర్షణకూ నిరంతరం కారణమవుతుంది. సైద్ధాంతికంగా బందీ అయిన వానికి వికాసం లేదు. రాబోయే వికాసానికి, శాంతికి ప్రస్తుతం స్వేచ్ఛాహరణం గాని, హింసాప్రవృత్తిగాని తగవు కదా! కృష్ణమూర్తి ప్రగతికి, సమతకు, ప్రజాస్వామ్యానికి వ్యతిరేకికారు. వాటి ఊహాగానంలో బందీ అయిపోవడాన్ని వేలెత్తి చూపిస్తారు. ఏ మూసకులోబడరు. స్వేచ్ఛకై చిత్త ప్రవృత్తిలో విప్లవపోరాటం జరగాలంటారు. దాని ద్వారా రాడికల్ మార్పు రావాలంటారు.

# 16. ఎందుకు కృష్ణమూర్తిని అర్థం చేసుకోవాలి

ఎందుకంటే, కృష్ణమూర్తి ఒక విలక్షణ మార్గంలో జీవన సత్యాలను మనకు అవగాహన చేయించే ప్రయత్నం చేశారు. ఆ మార్గాన్ని తెలుసుకుని, జీవితంలో సంపూర్ణ స్వేచ్ఛపొంది ప్రతిక్షణమూ అలాజీవించాలంటే కృష్ణమూర్తిని సమగ్రంగా అర్థం చేసుకోవలసి ఉంటుంది. ఎలాంటి అధికారాలు, ఆడంబరాలు, భేషజాలు, ప్రత్యేక గుర్తింపులు లేకుండా కలిసిమెలిసి జీవించారు.

కృష్ణమూర్తి ఆంతరంగిక సమగ్రతను పొందినవారు. కులమత జాతి దేశ రాజకీయ, ఆధ్యాత్మిక ఇజాలకు అతీతంగా జీవించినవారు. అభేదతత్త్వాన్ని జీర్ణం చేసుకున్నవారు. మానసికమైన హెచ్చుతగ్గులకు స్వస్తి పల్కినవారు.

కృష్ణమూర్తి ఉన్నది ఉన్నట్లు చూసేవారు. సత్యంలో సత్యాన్ని, అసత్యంలో సత్యాన్ని గ్రహించేవారు. మానసిక నిబద్ధతలను, నమ్మకాలను, మనో వైఖరిలను క్షుణ్ణంగా పరిశీలించేవారు. బాహ్యంగా, ఆంతరంగికంగా ఉన్న సత్యాలను తెలుసుకునేవారు. ఆంతరంగిక విప్లవం ద్వారానే, బాహ్య విప్లవం సాధ్యమని చెప్పారు. జ్ఞానం పవిత్రమూకాదు, సర్వస్వమూ కాదని తేల్చారు. ఆలోచనయొక్క పరిమితులు కనిపెట్టారు. ధ్యానం దైనందిన జీవిత పరిశోధనకు ప్రసన్నతకు సంబంధించిన జీవన వైఖరి యని చూపించారు.

కృష్ణమూర్తి క్రొత్తమానవుని ఆవరణను ఆశించేవారు. సర్వమానసిక చెరల నుండి బయటపడిన మానవుడే, కృష్ణమూర్తి దృష్టిలో క్రొత్తమానవుడు. ఆ మానవుడు స్వేచ్ఛగా అవగాహనాయుక్తంగా -అనుక్షణపు ఎరుకతో జీవిస్తాడు.

కృష్ణమూర్తి ఉద్యమాలను వద్దంటారు. వ్యవస్థీకృత సంఘాల అనుసరణ ప్రమాదకర మంటారు. సైద్ధాంతిక ప్రచారాల వల్ల మనిషిలో మార్పు అసంభవమని చెబుతారు. వ్యక్తి ని - మతాన్ని - గ్రంథాన్ని అధికారంగా స్వీకరించటం పతన హేతు వంటారు. గతానుభవ స్మృతులను పూర్తిగా త్యాగం చేస్తేనే, విడుదల సాధ్యమంటారు.

"స్వేచ్ఛ - సౌఖ్యం నేను పొందాను. వీటిని అందరూ పొందాలనే నా ధ్యేయం. జీవితాన్ని ఉన్నదున్నట్లుగా అర్థం చేసుకోవాలి. అభిప్రాయాలు వదిలి సత్యాన్ని తెలుసుకోవాలి." కృష్ణమూర్తి మాటల సారాంశం ఇది. నిజమైన జీవితాశక్తి ఉన్నవారు వివరంగానూ సూక్ష్మంగానూ గాఢంగానూ తీవ్రంగానూ అర్థం చేసుకోవడమే చేయవలసిన పని.

# 17. దేశం కృష్ణమూర్తిని రక్షించుకోవాలి

## మన కృష్ణమూర్తి

ఈ దేశానికి ఈ మానవ ప్రపంచానికి, నిజమైన మేలు జరగాలంటే నేడు మనకు కృష్ణమూర్తి కావాలి. ధార్మిక తాత్వికత విషయంలో కృష్ణమూర్తికి వారే సాటి. ప్రజ్ఞతో కూడిన తాత్విక దర్శనానికి అతను ప్రత్యక్ష సాక్షి

మనిషిలో మానవత వికాసానికి నిదర్శనాలేమిటి? ప్రేమ ప్రజ్ఞ వల్ల ప్రకటన మయ్యే మధుర వచనాలతో పాటు నిస్వార్థత మిళితం కావాలి. ప్రజోద్ధరణ దీక్ష వుండాలి. రచనలలో నిర్వైరం, నిండుతనం తాండవించాలి. జీవితంలో వైరుధ్యం లేకుండాఉండాలి. సహేతుకత పండాలి. అతార్బాహ్య ధోరణులకు అభేద ముండాలి. చేతనత్వం పదార్థ తత్వంతో సమన్వయం చెందాలి. అపుడు జీవితం, వికాసం వాస్తవికంగా వుంటాయి. ఇవన్నీ కృష్ణమూర్తిలో ఉన్నాయి. కృష్ణమూర్తి అర్థం కాదని ప్రక్కకు నెట్టుతున్నాం. కృష్ణమూర్తిని మనం ఉపేక్షించ కూడదు.

ఏ గ్రంథంలోనైన అక్కడక్కడా గొప్పతనం ఉండవచ్చు. ఎవరి జీవితం లోనైనా కొంత మంచి వుండవచ్చు. మేలుకూర్చే వాక్యాలు గోచరించవచ్చు. మెరుపులుండవచ్చు. అంతమాత్రాన ఆ గ్రంథం పూర్తిగా గొప్పది కాదు, ఆ జీవితమూ మహోన్నతం కాదు. మౌలికోద్దేశమేమిటి, ఏమి నిలబెట్టదలిచారు, ఏ వి సమగ్రంగా సూచించారు, ఎలా జీవించారు అనేది చూడాలి. సంప్రదాయాన్ని స్థిరపరచదలిచారా లేక, సమత్వం సాధించదలిచారా అనేది చూడాలి. విభజన చేస్తున్నారా లేక విశ్వజనీనత దర్శిస్తున్నారా అనేది నిగ్గు తేల్చాలి. ఈ పరీక్షలకు కృష్ణమూర్తి నిలబడతారు.

## కృష్ణమూర్తిని చూడడం :

కృష్ణమూర్తి యొక్క అభేదదృష్టి వల్ల అతన్ని ఔపనిషదిక ఋషి అనవచ్చు. అంతర్దృష్టి వల్ల జ్ఞానిగా గోచరించవచ్చు. సహేతుకత వల్ల హేతువాది అనవచ్చు. వాస్తవిక పరిశీలన వల్ల పదార్థ విజ్ఞాని అనవచ్చు. మనోవిజ్ఞానం వల్ల మానసిక శాస్త్రవేత్త అనవచ్చు. తత్వధోరణి వల్ల వేదాంతి అనవచ్చు. దైవాన్ని నిర్ధారించలేదు గనుక నాస్తికుడనవచ్చు. పుట్టుకవల్ల బ్రాహ్మణుడనవచ్చు. జాతిభేదం వదిలాడు గనక విశాల హృదయుడనవచ్చు. ఇలా ముక్కలు చేసి చూడడం అనర్థం, తప్పిదం. అంచేత జాగ్రత పడవలసిన అవసరం వుంది.

జాగ్రత :

కృష్ణమూర్తి జీవితాంతం తనకు తాను జాగ్రత పడ్డాడు. తగినన్ని హెచ్చరికలు చేశాడు. ఆస్తిలో వంశపారంపర్యపు హక్కులేకుండా, తనదంటూ లేకుండా చేసుకున్నాడు. జ్ఞానంలో సాధికారత ఎవ్వరికీ ఇవ్వలేదు. ఇంకా కల్తీచెందని ఆడియో వీడియో టేపులలోనూ, పుస్తకాలలోనూ యధాతథంగా వున్నాడు. ఎలక్ట్రానిక్ మీడియా అతన్ని మన కళ్ల ముందుంచింది. అయినా అతన్ని ఏ ప్రక్కకైనా నెట్టివేయగల సమర్థులం మనం. ఏ సంప్రదాయంలోనో కుక్కి వేయగలం. అవతార పురుషుణ్ణి చేయగలం. ఇప్పటికే అతన్ని కొందరద్వైతిగా చిత్రిస్తున్నారు. థియాసోఫిస్టుగా చూస్తున్నారు. వసిష్ఠుని నుండి కృష్ణమూర్తి దాక మేధావులందరూ బ్రాహ్మణులే అని అతనికి బ్రాహ్మణత్వం ఆపాదిస్తున్నారు. "బ్రాహ్మణ కులంలోపుట్టినా నేను బ్రాహ్మణుడనుకాదు, భారతీయుడనుకాదు" అని మానసిక ఎల్లలన్నీ తుడిచి వేశాడతడు. హిమాలయమంతటి మేథాశక్తి అద్వైత సిద్ధాంతాన్ని కనిపెట్టింది. దానికి మించింది ఊహించడానికి వీల్లేదనిపిస్తుంది. కాని దానికి సామాజిక భూమిక, బాధ్యత లేదు, ఆచరణ ప్రాతిపదికలేదు. నిత్యజీవిత సంబంధం లేదు, సమాజ దర్పణంలో అది నిర్వీర్యమైంది, నిష్ఫలమైంది. కాబట్టి కృష్ణ మూర్తిని అద్వైతుల్లో చేర్చరాదు. అతని పేర గాని, అధ్యయన కేంద్రాలలోగాని, భక్తిగీతాలు గాని, వేదమంత్రాలుగాని ఆలాపించడం సరికాదు. సంప్రదాయ కృతుల్లో గానమాధుర్యం ఆలకించవచ్చు. ఆనందించవచ్చు. కాని అందలి భావాల ప్రభావంలో పడరాదు. కృష్ణతత్వాన్ని ఒక శాఖగా, ఒక మతవిశ్వాసంగా చేయతగదు. మనోపారిశుద్ధ్యం (Sanity), సూక్ష్మస్పందన (Sensitivity), అపురూప అవిభాజ్యస్థితి (Unique indivisibleness) గల కృష్ణమూర్తికి మనం పిల్లచేష్టలతో రంగులు పులమరాదు. తర్జుమాలు చేసేవారు చాల జాగ్రత పడాలి. ఆయన తత్వం పట్ల నిజమైన నిష్ఠ వుంటే మాత్రమే తర్జుమాకు పూనుకొనాలి. అంటే భాషా జ్ఞానమొక్కటి సరిపోదు. దినదిన జీవితంలో కృష్ణావగాహన ప్రతిబింబిస్తూ వుండాలని అర్థం.

చరిత్ర - చైతన్యం:

కృష్ణమూర్తి జన్మించాడు, జీవించాడు, వెళ్ళిపోయాడు. అంతేనా? కాదు. కృష్ణమూర్తి బుద్ధిలో, హృదయంలో, నాల్కపై తిష్ఠవేసి యున్నాడు - ఆసక్తి పరులపట్ల.

ఆయన మరణించినాక ఈ దశకంలో కృష్ణతత్వం జనబలం పుంజా కొంటున్నది. అది వార్షిక కూటములలోనూ, పుస్తకాల కొనుగోలులోనూ, టేపుల వినియోగంలోనూ, అధ్యయన కేంద్రాల నిర్వహణలోనూ కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. ఇవి ఆశ్రయ స్థానాలు మాత్రమే. ఇది ఆశాజనకం! మానవాళిలో పెనుమార్పు రావాలంటే ఎంతో జరగాలి, ఇంకెందరి హృదయాలో కదలాలి. ఒక కృష్ణమూర్తి చాలడు. అంతేకాదు, ఏఒక్క తత్వమూ అన్ని సమస్యలకూ అత్యవసర మంత్రదండం కాక పోవచ్చు. సమగ్రత, సారూప్యత గల ఇతర తత్వాలను పూరింప వలసి వుంటుంది. అదే సమన్వయావశ్యకత. కృష్ణతత్వం సమగ్రమైంది. కృష్ణమూర్తి మీడియాను సంపూర్ణంగా వినియోగించుకున్నాడు. అది ఆయన సౌలభ్యం. మనం ఆయన్ని లోతుగా పరిశీలించే అవకాశం కల్పించాడు. మనమీనాడు మీడియాను మిక్కుటంగా వ్యాపారీకరించి, దుర్వినియోగం చేసుకుంటున్నాము.

కృష్ణమూర్తి దేశంతో జీవించాడు. దేశమంటే గురుజాడ చెప్పిందే. కాగా, అతను మట్టితో కూడ జీవించాడు. మట్టి ప్రకృతికి ప్రతీక. అతని జీవితం - పర్యావరణ పరిరక్షణకు ప్రథమ సోపానం. అలాగే ప్రపంచంతో జీవించాడు, ప్రపంచాన్ని మేల్కొల్పాడు. ఇలా మానవాళి మేల్కొనాలి. మీడియా మత్తునుండి జాగృతి వహించాలి. మత ఛాందసం నుండి వైతొలగాలి. రాజకీయపు చెత్త నుండి బయట పడాలి. ఆర్థిక విలువల 'అతి' నుండి జాగ్రత పడాలి. ఈ మత్తులను, ప్రమత్తులును తమకు తాము అర్థం చేసుకోవాలి, విముక్తి చెందాలి. అప్పుడు మాత్రమే కృష్ణమూర్తి అర్థం అవుతాడు. వాటిని సరిగ్గా పరిశీలించడానికి కూడ కృష్ణమూర్తి సాయపడగలడు. అర్థం చేసుకోడానికి ఒకింత నిలకడ మనసుండాలి ముందు. స్పందనతో కూడిన మానవ సబంధ గౌరవం ఒకింత అవసరం.

అందుచే ఎక్కడ ఎలా మొదలు పెట్టాలనేది ఎవరికి వారు నిర్ణయించు కోవాలి; మొదలుపెట్టాలి అసలు త్వరిత గతిని. కృష్ణజీయొక్క జీవన జాగృతిని గమనించాలి. సమకాలీన సన్నిహితులతో సంభాషించాలి, ఇలా చేస్తూ అతని పుస్తకాలు టేపులు ముందు పెట్టుకొని ఇలా చేస్తూ కృష్ణతత్వం అంటే ఇది అని కొంతవరకు చెప్పొచ్చు. అసలు తత్వం జీవించి చూస్తే గాని అంతు పట్టదు. ధ్యాన సంగమంలో గాని అది తేలదు. అయినా పరిచయానికైనా కొంత పరిశీలన చేయాలి. అది బౌద్ధికమైనా కావచ్చు, కమిట్మెంటుకైనా దారితీయొచ్చు. కృష్ణమూర్తి ఒక అద్భుత దృశ్యం. ఒక అపూర్వ

మైన వ్యక్తిత్వం, ఒక విప్లవాత్మకమైన ప్రబోధ దర్శనం. జిడ్డు కృష్ణమూర్తి ఒక జిడ్డు అనితేలికగా కొట్టిపారవేయవద్దు. వజ్రాన్ని వజ్రంతోనే ఖండించాలి. మన జిడ్డును జిడ్డుతోనే వొదిలించాలి.

**సంక్షిప్తంగా తత్వం :**

కృష్ణమూర్తి తత్వ చింతనలో విప్లవం రేకెత్తించాడు. మనసుతోనే తత్వ మేర్పడుతుంది. మనసు అన్ని కర్మలకు మూలమవుతుంది. అందుకే మానసిక విషయాలకు ప్రాధాన్యత విచ్చాడు. కొత్తగా చేయవలసిన దానికన్నా పట్టింది వదిలించుకోవడం ప్రధానమని సూచించాడు. సేకరించిందీ, సంపాదించిందీ, ఆర్జించిందీ మొత్తంగా వదులుకో, గతమంతా వదులుకో. మంచి ఆలోచనలు పెంచుకోమని ఎందరో చెప్పారు ఇప్పటి దాక. ఆలోచనే అనర్థకారి అని కృష్ణమూర్తి చెప్పాడు కొత్తగా. ఆలోచనే గతం, ఆలోచనే జ్ఞానం, ఆలోచనే కాలం నిలబడి లోతుగా చూస్తే గాని అవి తెలియవు. జ్ఞానాన్ని (విషయసేకరణ, పాండిత్యం, నిలవసరుకు) ఇంతకాలమూ ఆరాధిస్తూవచ్చాం, తరుణోపాయమని నమ్మాం. జ్ఞానమే అవగాహనకు అవరోధమని ఇపుడు చెప్పాడు, మనసుకు భారమని తేల్చాడు. ఒక ఉపన్యాసం విన్నపుడు దాన్నుండి జ్ఞానాన్ని, (Knowledge) ప్రోగుచేసు కోరాదు; అవగాహన చెందాలి. అంతటితో దాని పని తీరిపోయింది. పుస్తకమయినా అంతే. అవగాహన (Understanding) వర్తమానానికి చెందింది, తక్షణ క్రియా శీలకమైంది. స్పందన, మార్పు దాని లక్షణాలు. అది ఎరుక (Awareness) తోనే సాధ్యం. అది సంపూర్ణమైన గమనిక, నిఘా, జాగృతి, ఎంపిక (choice) లేనిది. దాన్నుంచి తెలివి (Intelligence) పుడుతుంది.

అది బుద్ధి (Intellect) కి వేరైంది. తెలివి లేక ప్రజ్ఞ ప్రేమకు ఆస్కారమైంది. ప్రేమ ఏ క్షణానికి ఆక్షణం అవసర క్రియకు పురుకొల్పుతుంది, ప్రతిక్రియ (Reaction) కు కాదు. ప్రకృతిని, భార్యను / భర్తను, తననుతాను మనోబింబం (Image) లేకుండా చూసే తీరు నేర్పాడు. సిద్ధాంతానికి ఆచరణకు మధ్యగల సాధనను (Spiritual Practice) బద్దలు చేశాడు. ఆదర్శాన్ని ముందుపెట్టుకొని ఏదో కావాలనే దాని (Becoming) లోగల వంచనా శిల్పాన్ని స్పష్టం చేశాడు. సత్యం మార్గబద్ధం కాదు (Truth is a pathless land) అన్నాడు. ఎవరికి వారు పరిశీలన (Observation) చేయాలి. ప్రత్యక్షీకరణ (perception) తోడ్పడాలి. అది అంతర్దృష్టి (In-

sight) తో జరిగేది గాని గురువుతో, అధికారంతో కాదు. తనపోకడలను తాను తెలిసికోవడం వల్ల అంటే స్వీయజ్ఞానం(Self knowledge) తో నిజమైన చూపు వుంటుంది. నేను - నాది అనే భావం తొలుగుతుంది. ధ్యానంలో సమూలమైన మార్పు (Radical change) తెచ్చాడు. అది ఏకాగ్రత (Concentration) కువేరైంది. శ్రద్ధ - ఆసక్తి - చురుకుదనానికి మూలమైంది. ఆలోచన, ధ్యేయం, కేంద్రం, శబ్దంలేని నెమ్మదితనం అనేది ఒక నిశ్చలస్థితి. అక్కడ విశాలత, శూన్యత, శక్తిపాతం వుంటాయి. అది నిరంతరం జరుగుతుంది, అనన్యస్థితి నిస్తుంది. ఇదీ నూతనత్వం.

## 18. జీవితం అంటే ఏమిటి?

### మనసు జీవితాన్ని చూడనివ్వదు

జీవితాన్ని ముఖాముఖిగా, సరాసరిగా చూడాలంటేనే మనసు అంగీక రించదు. ఉన్న స్థితిని ఉన్నదున్నట్లుగా గ్రహించడానికీ, బయట పెట్టడానికీ, మార్పు చేసుకోడానికీ ఇష్టపడక పోవడమే అందుకు కారణం. అందుకని జీవితమనేదాని చుట్టూ అభిప్రాయాల అల్లిక చేస్తుంటాం. ఆవిధంగా జీవితమంటే అనేక అభిప్రాయాలేర్పడ్డాయి. అభిప్రాయాలు అభిప్రాయేలగాని వాస్తవాలు కావు.

ఇకపోతే జీవితం ఆధ్యాత్మికమనీ, భౌతికమనీ విడదీస్తుంటారు. భౌతికదేహాన్ని ఆధారం చేసుకొని ఆధ్యాత్మికంగా బ్రతకాలని అంటారు. రెంటికి సమన్వయం కుదరాలని అంటారు. ఆధ్యాత్మిక జీవితమే ధ్యేయమూ, ఉన్నతమూ అంటారు. మరోవిధంగా చెప్పడం కూడ వుంది. సైన్సు పరంగా అభివృద్ధి చెందుతూ దైవపరంగా జీవించాలంటారు. అనగా పదార్థ జ్ఞానంతోనూ మతనిష్ఠతోనూ గడిపేదే సరైన జీవితం అంటారు. సైన్సూ, స్పిరిచ్యుయాలిటీ సమపాళ్లలో ఉండాలనికూడ అంటారు. ఇదే జీవితం, సమగ్రత అని చాటేవాళ్లు ఎక్కువగా వున్నారు.

### అధ్యాత్మికత అంటే

ఆధ్యాత్మికత అనేదాని అర్థం రాను రాను సంప్రదాయ బద్ధమైపోయింది. దైవపరంగానూ, ఆత్మపరంగానూ, పరమాత్మపరంగానూ, శాశ్వత తత్వాల కను కూలం

గానూ చింతింపచడం జరుగుతోంది. దానివల్ల శబ్దాలూ సంజ్ఞలూ, ముద్రలూ, వేషాలూ, ఆలోచనలూ ముఖ్యమై పోయాయి. అందుచే వాస్తవ జీవి తానికి, ఆధ్యాత్మిక జీవితం దూరమైపోతోంది. యదార్థ జీవితంతో సంబంధం లేకుండా పోతోంది. పైగా దైవమూ, ఆత్మ అనేవి ఊహాజనిత విషయాలు. మనసు సృష్టించుకొన్నవి. ముందుగానే నిర్ణయించుకొన్న ఆలోచనలు. ఆదర్శ విషయాలైనవి. అనుభూతి విషయాలుగా లేవు.కాబట్టి ఆధ్యాత్మిక జీవితమంటూ వాస్తవంగా ఫీల్ అవడానికీ, గుర్తించడానికీ ఏమీ లేదు. నిర్ధారణకు నిలవదు. పర్యవ సానంలో ఆధ్యాత్మికానికీ, భౌతికానికీ అంటే వాస్తవానికి ఊహకు కలయిక ఎలా? ఏ సంబంధంతో ఆధ్యాత్మికాన్ని పదార్థజ్ఞానంతో ముడిపెట్టగలరో చూడాలి.

కాగా, సమగ్రత అంటూ ఏ ఒక్కటైనా జీవితంలో ఉందా అని చూద్దాం. ముందుగా జీవితమంటే ఏమిటో పరిశీలిద్దాం.

**సంబంధాలు**

జీవితమంటే సంబంధం. ప్రజలతోనూ, ప్రకృతితోనూ, విజ్ఞాన శాస్త్రంతోనూ, మనసులోని భావాలతోనూ వుండే సంబంధం. జీవితం స్వేచ్ఛగా, నిరాఘాటంగా, వికాసవంతంగా, శాంతిగా గడవడం ముఖ్యం. సంబంధమనే అద్దంలో మనిషి తన్నుతాను చూసుకోవాలి. తన మనుగడ సరిచేసుకోవాలి. అవసరమైన రీతిని విప్లవాత్మకంగా మార్పు చెందాలి. హృదయాంతరంగంలో సమూలమైన మార్పు ద్వారా సమసమాజ నిర్మాణానికి కారకుడు కావాలి.

జీవితంలో సామాన్య దైనందిన జీవితపుటనుభవాలు ఎప్పటి కప్పుడు పెన వేసుకొని వుంటాయి. అలాంటి అల్లికే జీవితం. నిత్య విషయాలను సంపూర్ణంగా, సావధానంగా, యథాతథంగా అవసరమైన మేరకు అనుభవించడమే జీవితం. చిన్న విషయాలనిగానీ, పెద్ద విషయాలనిగానీ నిర్లక్ష్యం చేయడానికి లేదు. చిన్న విషయాల్లో గొప్పతనమూ, పెద్ద విషయాల్లో చిన్నతనమూ కూడా గ్రహించాలి. అందుకు పరిశీలనాత్మకమైన మనస్సూ, ప్రేమించే హృదయమూ ఉండాలి.

**వర్తన - చింతన**

సరిగా వర్తించాలంటే సరైన చింతన వుండాలి. సరైన చింతనకు స్వీయ జ్ఞానముండాలి. అది సంబంధంలోనే లభిస్తుంది, ఒంటరి తనంలో కాదు. కాబట్టి

మన అవగాహనే సక్రమచర్య, సౌఖ్యం కూడ. జీవించడం సరిగ్గా తెలిస్తే చావును గూర్చి భయపడడం  జరగదు. మరణానంతర జీవితంపై ఆశలు పెంచుకోవడం ఉండదు. జీవన్మరణాలు కలిసే సాగుతాయి. అదేమిటో చూడాలి.

### క్షణ క్షణం

జీవితం సెలయేరులాంటిది. సాగుతూనే వుంటుంది. అయినా ఎప్పటి కప్పుడు తాజాగా వుంటుంది. ఏక్షణానికి ఆక్షణం జీవించేదే జీవితం. అపుడే చైతన్యవంతంగా వుంటుంది. జీవితం వాస్తవమైంది. జీవిత సత్యమే సత్యం. దాన్ని నిజంగా తెలుసు కోడానికి నమ్మకం, దైవభావం, స్వర్గం, పుణ్యాపాపాలు అడ్డు తగుల్తాయి. నిత్య జీవితపు తీరులో సత్యం అనుభవైక్య మౌతుంది. అన్వేషణకు లోబడదు. ఆలోచనకు తావులేని ప్రేమ వున్నపుడే జీవితం పువ్వులా వికస్తుంది.

### విజ్ఞానం - అంతరంగం

జీవించడంలో అనేక తత్వాలు చోటు చేసుకున్నాయి. ద్వైతం, అద్వైతం, పదార్థికం. తత్వాలు సైద్ధాంతికమైనవీ ఉన్నాయి. నిజమైన జీవితం అనుభూతి పరమైంది. కనుకజీవితానికి మతాలూ, మందిరాలూ,లేవు. అది కేవల పదార్థ సంబంధమూ కాదు.

జీవిత పోషణకు తిండి, బట్ట, నీడ తప్పకుండా ఉండాలి. అందుకు శ్రమలూ, పరిశ్రమలూ తప్పవు. వాటి విషయంలో న్యాయమూ, ధర్మమూ, సమానావకాశాలు తప్పనిసరైనవి. వాటి వినియోగంలో సోదరభావమూ, స్వాతంత్ర్యమూ, ప్రేమ వుండాలి. అందులో భాగంగానే అంతరంగం పనిచేస్తుంది. మనసు యొక్క ప్రేరేపణలూ, ఆమోదాలు పనిచేస్తాయి.

ఒకప్రక్క సైన్సు ద్వారా భౌతిక పదార్థ లాభం పొందుతూ, విజ్ఞానం వినియో గించు కొంటూ, మరోప్రక్క మానసిక ధోరణులు సక్రమంగా వుండేటట్లున్నూ, స్వేచ్ఛగా వికసించేటట్లున్నూ చూసుకోవలసిన బాధ్యత వుంది. స్వేచ్ఛావగాహనలో, లోలోతు పరిశీలనలో జీవితంలో విప్లవాత్మకానుభూతు లుంటాయి.

సాంకేతిక పరిజ్ఞానంతోపాటు, యథార్థమైన అంతరంగిక స్థితి యొక్క ఎరుకలో ఉంటాలి. తద్వారా'మంచితనం' పెంచుకోవడం అవసరం. అది ఇప్పటి సమాజంలో చెలామణి అయ్యే మంచికాదు. ముక్క చెక్కలుగాని నిండుతనమూ, నిజాయితీయే 'మంచితనం'. నమ్మకం పట్ల నిజాయితీ వుండడం సమగ్రతకాదు. ఎందుకంటే

'నమ్మకం' ఊహతో కూడింది. రెంటినీ విజ్ఞానంతోపాటు 'మంచి' ప్రవృత్తి వుండాలి. ఈ రెంటినీ ఒకే క్షేత్రంలో ఏకోన్ముఖంగా, పెంచుకోవడం సమగ్రత. ఇవి రెండు క్షేత్రాలు కావు; రెండు వేరు వేరు విషయాలు కలవడమూ కాదు. చిత్తప్రవృత్తి 'మంచి'గా మొదటి నుంచీ వికసిస్తూ, వాస్తవికతను ఆలంబన చేసుకుంటూ, సాంకేతికాభివృద్ధి చెందడంలోనే జీవిత సమైక్యత, సమగ్రత వున్నాయి. సైన్సులో నూతనావిష్కరణ ఉన్నట్లు, హృదయంలో సత్యావిష్కరణ జరగాలి. రెంటిలోనూ పరిశోధన మూలసూత్రం. అందుచే అంతరంగ వాంఛలు, వైజ్ఞానిక వాంఛలు జీవితంలో సమన్వయమైతే ఆజీవితం ధన్యం.

# 18. ఆంతరంగిక జీవితం - మానవ సంబంధం

**లో బయలు :**

ఆంతరంగిక జీవితం, బాహ్యాజీవితం అని రెండున్నాయా? విడివిడిగా వున్నాయా? నిజానికి విభజనలేదు, వేరుగా లేవు, రెండంటూ లేవు. కాని సౌలభ్యం కోసం రెండుగా చేశాం; అర్థం చేసుకోడానికి వాడుతున్నాం. పదాలు భావాన్ని తెల్పేవరకే ప్రయోజనం. కంటికి కనపడేదాన్ని బాహ్యమంటున్నాం. కనపడని దాన్ని ఆంతరంగిక మంటున్నాం.

**మనసు :**

మనసంటూ ఒకటున్నది. దాని పోకడలు కొన్న తెలుసు. జ్ఞాపకాలు, ఆలోచనలు, ఊహలు, పథకాలు, ఇష్టాయిష్టాలు, రాగ ద్వేషాలు, శాంతి సహనాలు, మంచి చెడ్డలు, బంధమోక్షాలు మనసుకు సంబంధించిన ప్రక్రియలు. లోలోన జరుగుతూ వుంటాయి. ఈ మొత్తాన్ని కలిపి ఆంతరంగికం అంటున్నాం. జీవితాన్ని సమగ్రంగా చూసినపుడు ఆంతరంగికమే బాహ్యంగా, బాహ్యమే ఆంతరంగికంగా కనపడుతుంది. అవి వేరు వేరుగా వుండడం అసహజం. కాబట్టి ఒక్కటే. ఆ ఒక్కటి లోన భావనగా, బయట క్రియలుగా ప్రకటన మౌతుంది; ధ్వనిస్తూ, ప్రతిధ్వనిస్తూ వుంటుంది. జీవితం ఒకటే. లోన ఒకటిగా వుంటాను, బయటికి మరొక విధంగా వుంటాను అనడం కుదరదు. అలాగే వ్యక్తిగతంగా ఒకరకం, బయటి ప్రపంచంలో, వృత్తిలో మరోరకం అనడం తప్పు.

**అంతరంగం ఆధ్యాత్మికమా?**

ఆంతరంగిక జీవితాన్ని ఆధ్యాత్మిక జీవితం అనడం కద్దు. ఆధ్యాత్మికమనే శబ్దానికి ఒక నిర్దిష్ట భావం ఏర్పడివుంది. అది సంప్రదాయకంగా స్థిరపడింది. నిజానికి ఆధ్యాత్మికం అంటే భౌతిక విషయమని అర్థం. కాని ఆత్మ విషయమనే భావం పాతుకు పోయింది. ఆత్మ - పరమాత్మ - దైవ - వేదాంత - తాత్విక విషయాలకు సంబంధించింది ఆధ్యాత్మికం అనే అర్థం రూఢి అయింది. ఆత్మ పరమాత్మలు తెలియకనే, దైవ విషయం అంతు పట్టకుండానే అధ్యాత్మ బోధ చేస్తుంటారు, ఆధ్యాత్మిక సాధన చేస్తున్నామని కొందరంటారు; ఆధ్యాత్మిక జీవితం గడుపుతున్నామంటారు కొందరు. కాబట్టి ఆధ్యాత్మిక (Spirituality) అనే పదం అపార్థం కల్పిస్తోంది. అదేదో తెలియకనే, లోని జీవితాన్ని ఆధ్యాత్మిక జీవితమనే బదులు 'ఆంతరంగిక జీవితం' అని అంటే సన్నిహితంగా వుంటుంది, అర్థమయ్యే రీతిలో వుంటుంది.

**ఆంతరంగికం - మనస్సు :**

ఆంతరంగిక జీవితం ప్రధానంగా మనసుకు సంబంధించింది. మనసు హెచ్చరికను బట్టి పనులు మొదలవుతుంటాయి. మనసులోవి ప్రేరణ, క్రియలకు పురికొల్పుతుంది. కనుక జీవిత గమనమునకు మనసు ప్రధానమని తెలుస్తుంది. మనసు ఎలా నిర్మాణ మయిందో, తెలుసుకోవడం అవసరం. దాని స్వభావం, దానిపనితనం, దాని పరిమితి గమనించాలి.

లోన జరిగే ప్రక్రియకు మూలం మనసు. అలాగే బాహ్యంగా జరిగే క్రియకు కూడ మూలం మనసు. ఇది అర్థమవుతోంది. మరో విషయం కూడా అర్థం చేసుకోవాలి. బాహ్య క్రియలనుబట్టి స్పందించి, లోన నిర్మాణమయ్యేది కూడ మనస్సే. కాబట్టి లోబయలులను అర్థం చేసుకొనేది, చక్కదిద్దేది, సమన్వయం చేసేది, తేడా కల్పించేది, చెడగొట్టేదీ మనసే అని తెలుస్తుంది.

ఇంత వరకూ మనం కలిసి తెలుసుకున్నాం, కలిసి ప్రయాణం చేస్తున్నాం. ఇక్కడ తెలిసిన వాడూ తెలియని వాళ్లూ అని రూపుదిద్దుకోవలసిన అగత్యం కనపడలేదు. కాబట్టి మనందరం ఒకటిగా ఒక్కొక్క అడుగుముందుకు వేద్దాం.

**మెదడులో భౌతిక ప్రక్రియ:**

ఇంకాస్త పరిశీలిస్తే లోనకూడ ఒక భౌతిక ప్రక్రియ జరుగుతోంది. అది

మెదడులో జరుగుతోంది. మెదడు కణాలు ఆయా స్థానాలలో వుండి పని చేస్తున్నాయి. కణాలుగాని మాలిక్యూల్స్ గాని కలవడంలో, విడిపోవడంలో రసాయనిక చర్య (Chemical action) జరుగుతోంది. మెదడు పని చేసే తీరును బట్టి, దానికుండే సరళతను బట్టే, దానిపై వచ్చే వత్తిడులను బట్టే రసాయనిక ప్రక్రియ మార్పు చెందుతూ వుంటుంది. అనుభవాలు, స్మృతులు, జ్ఞాపకాలు, ఆలోచనలు -వీటన్నిటికీ స్థానం మెదడు. ఇదంతా కూడ ఆంతరంగిక ప్రక్రియ. ఆంతరంగిక జీవితం అంటే ఏమిటో ఇపుడు మనకు కొంత అవగాహన ఏర్పడింది.

**జీవిత సంబంధాలు :**

ఇపుడు మానవ జీవిత సంబంధాలు చూద్దాం. జీవితం అంటేనే సంబంధం. సంబంధం ద్వారానే ఉనికి, వ్యక్తి, వ్యక్తీకరణలు గోచరిస్తాయి. సంబంధం లేకుండా ఏ వ్యక్తి జీవనమూ సాగదు. తనతో, తన మనస్సుతో, తన వారితో, ఇరుగు పొరుగుతో, ప్రకృతి - పరిసరాలతో, ప్రపంచంతో, విశ్వాసంతో సంబంధం ఏర్పడి వుంది. ఈ సంబంధాలను సూటిగా అర్థం చేసుకుంటూ, సరిచేసుకుంటూ, మార్పు చెందుతూ, వాస్తవికంగా కొనసాగేది జీవితం. అదే ఎప్పటికప్పుడు వినూత్నంగా జీవించడం అవుతుంది. కొంత విశ్లేషించి చూస్తే ముఖ్యాంశాలు కనపడతాయి.

దేహావసరాలు తగురీతిని తీర్చుకోవడం, మానసిక వికాసం నిరంతరం చెందడం, ఆంతరంగిక వైఖరిని గమనించుకోవడం, సంబంధాలలో స్పందించడం, స్వేచ్ఛగా, తెలివిగా, ప్రేమగా జీవించడం మానవ జీవిత సార్థకత అని చెప్పుకోవచ్చు. అందుకు ఆశ, ఆశయం, ధ్యేయం, త్యాగం, విజయంమున్నగువాటిని అంటి వుండనవసరం లేదు. ఏదో సాధించాలనో, ఏదో అయిపోవాలనో అనుకోనవసరం లేదు. మరణానంతర పుణ్యమో, సుఖమో, మోక్షమో, మరింత మరింతో పొందాలను కోవడం వివేకం కాదు. తనకు తాను సమాధాన పూర్వకంగా వుంటూ, సామాజి కంగా స్పందిస్తూ, స్వేచ్ఛగా, వికాసంతో కొనసాగవలసి వుంది. వివిధ స్థాయిలలోనూ ఇతరులతో Communion పరస్పరకలయికతో వుండడం సంబంధం.

**సహజమైనవి - కల్పితాలు :**

మానవ సంబంధాలలో ప్రకృతి జనితమైనవి ఉన్నాయి. అంటే ప్రకృతి వల్ల కలుగుతాయి, అవి సహజమైనవి. బంధుత్వ -స్నేహ - వృత్తి మొదలగు

సంబంధాలున్నాయి. వాటిని మనిషి ఏర్పాటు చేసుకుంటుంటాడు. ఆలోచనల తోనూ, అభిప్రాయాలతోనూ - మనసుతో - వుండే సంబంధాలున్నాయి. అవి కలుగుతూ వుంటాయి, తొలుగుతూ వుంటాయి. ఏ సంబంధం మంచిదా, ఏ సంబంధం చెడ్డదా అన్న విశ్లేషణతో పనిలేదు. ఏ సంబంధాన్నైనా అర్థం చేసుకోవడం ప్రధానం. అవగాహన కలిగించేది, స్పందించేది మనస్సు. అవగాహన అనగానే క్రియారూపం చెందేదని గుర్తుంచుకోవాలి. జీవితానికి సంబంధించిన మానసిక విషయాల పట్ల దృష్టి పెట్టుకోవడం ఇందలి సారాంశం. కాబట్టి ఆంతరంగిక - మానవ సంబంధం ఏమిటని చూస్తున్నాం. అంటే ప్రతి సంబంధంలోనూ వున్న మానసిక విషయాన్ని మనం పరిశీలిస్తున్నాము. ఇప్పుడు కొన్ని విషయాలను ఉదాహరణగా తీసుకొని చూద్దాం.

**జీవించడం :**

జీవించడం అంటే వర్తమానంలో వృత్తి - ప్రవృత్తి - వ్యావృత్తులతో గడపడం. అది ఒకే ధార. క్షణ క్షణం గమనంలో వుంటుంది. ఏ క్షణానికి ఆక్షణం జీవించం జరుగుతుంది. జీవించడం నిజంగా ఒక గొప్ప కళ. స్వేచ్ఛలోనే జీవించడం జరుగుతుంది. పుట్టినందుకు బ్రతకాలి. ప్రేమగా బ్రతకటమే ప్రయోజనమూ, విధానమూ గూడ.

**భౌతికావసరాలు :**

నీడ, తిండి, బట్ట అనేవి అత్యవసరాలు. పరస్పర సహకారంతో తీర్చు కోవడం వరకే వాటితో వుండే సంబంధం. వాటిని మానసిక తృప్తి కొరకు వినియోగించుకోవడం వల్ల సంబంధం దెబ్బతింటుంది. ఘర్షణ మొదలవుతుంది.

**హేతువు :**

జీవితంలో ఆలోచన - తర్కం - హేతువు పరిమిత ప్రయోజనాల్నిస్తాయి. అవి మనసుకు పదును పెట్టగలవు. స్పష్టత నివ్వగలవు. వాటి సంబంధం అంతవరకు మాత్రమే. సంపూర్ణ అవగాహనకు అంతర్దృష్టి అవసరం. అంతర్‌దృష్టి హేతువువల్ల కలగదు, కాని హేతుబద్ధంగా వుంటుంది. అలాగే సత్యం వుంటుంది.

**కాంక్ష - అధికారం :**

మానవ సంబంధాలలో కాంక్ష బద్ధశత్రువు. అలాగే తృష్ణకు, తృప్తికి, మనిషిని-

ఇతరాన్ని వాడుకోవడం అనర్థదాయకం. అధికారానికి - ఏరకంగానూ, మతపరంగానైనా - అర్రులు చాచడం సంబధాలను బెడిసి కొడుతుంది.

**మృత్యువు :**

మృత్యువుతో సత్సంబంధం అంటే అది జీవితానికి వేరైంది కాదని అవగాహన చేసుకోవడమే. చావు, బ్రతుకు కలిసి సాగాలి; అవి అవిభాజ్యమైనవి. తాపత్రయాలు, ఆనందాలు స్వచ్ఛందంగా అంతమవుతుండాలి. స్మృతులు, అనుభవాలు ఎప్పటికప్పుడు మరుగున, మరుపున పుడిపోవడం వాటిపట్ల మృతి చెందడ మవుతుంది. తత్కాలంలో లేక తక్షణం నూత్న జీవితం వుంటుంది. జీవించడం, మరణించడం సన్నిహితమౌతాయి. మరణం పట్ల ప్రత్యేక భయం తొలుగుతుంది.

**ఆదర్శాలు:**

ఆదర్శాలతో వుండే సంబంధం అవాస్తవమైంది. ఎందుకంటే నీవున్న స్థితి వాస్తవమైంది, కావాలనుకొనేస్థితి ఇప్పటికి అవాస్తవమైంది. కాని దాన్ని అవునను కోవడమూ, మధ్యలో సాధనదశను ప్రవేశపెట్టడం భ్రమతో కూడింది. భ్రమ నుంచి వంచన, ఘర్షణ కలుగుతాయి. అభిప్రాయలు జీవితమనుకోవడం కూడ సత్యదూరం. ఎందుచేతనంటే అవిగతం నుండి పుట్టి భవిష్యత్తులోకి దూకుతాయి. వర్తమానం వృధా అవుతుంది. కనుక అది జీవించడం కాదు.

**ఏకాంతం :**

ఏకాంతంగా వుండే సంబంధం చాలా అర్థవంతమైంది. ఒక్కడుగా వున్నా పది మంది మధ్య బాధ్యత - ప్రేమలతో వుండే నిండుతనం వుంటుంది. ఏకాకి తనంలో పదిమంది మధ్యవున్నా ఒంటరిగా, నిర్వీర్యంగా ఉండే వెలితి వుంటుంది. మొదటి దాంట్లో ప్రేమ, ధ్యానం వుంటే, రెండో దానిలో నిస్పృహ, భీతి వుంటాయి.

**పరిసరాలు :**

పరిసరాలతో వుండే సంబంధం పోరాటమా లేక అంగీకారమా? రెండూకాదూ; అవగాహన, సహజీవనమూ సరైన విధానం. అయితే ఎదిరించే భావం విడనాడరాదు. అదిలేకపోతే చితికి పోవలసి వస్తుంది. లోబడటం నిస్సహాయ స్థితి అవుతుంది. పరిసరాలను అర్థం చేసుకున్నవాడు పర్యావరణ కాలుష్యానికి పాల్పడడు.

అంగీకరించేవాడు ఎదిరించలేదు. కాబట్టి సూక్ష్మంగా, తెలివిగా సంబంధ పడాలి.

**ఆంతరంగిక దృష్టి - ప్రేమ :**

మానవ సంబంధాలలో ఆంతరంగిక దృష్టి పనిచేసే తీరును నిరంతరం గమనించుకోవలసి వుంది. తద్వారా సంబంధాలు తేటగా, సరళంగా, సహజంగా వుంటాయి. తల్లి - బిడ్డ, భార్య - భర్త, అన్న - చెల్లి, ఉపాధ్యాయ - విద్యార్థి, గురు - శిష్య, ఇరుగు - పొరుగు సంబంధాలలో, అలాగే వృత్తి - ఆర్థిక - రాజకీయాది సంబంధాలలో మనసు పోకడలను నిశితంగా, లోతుగా పరిశీలించుకుంటుండాలి. ఆంతరంగిక దృష్టి ప్రేమమయమయినపుడు ఏ సంబంధమైనా పరిశుద్ధమైనదే.

**దైవిక - మత సంబంధాలు :**

ఇక పోతే దైవిక - కుల - వర్గ - జాతి - మత సంబంధాల వాస్తవికతను చూడాలి. వీటికి మూలం ఒక భావం. ఇవి మానసికంగా తయారైనాయి. వీటికి వైజ్ఞానిక ఆధారంగానీ, జీవితపు యదార్థతగానీ లేదు. కాబట్టి ఇవి అసంబద్ధమైనవి, అసంబంధమైనవి. మానవ స్వార్థం నుంచి పుట్టి, మనుషులను విభజించి, ముక్కలు చేసి ఆశలు - ఆకాంక్షలు రేకెత్తించి ప్రపంచంలో అల్లకల్లోలం సృష్టిస్తున్నాయి, యుద్ధాలకు దారితీస్తున్నాయి.

**సమగ్రత :**

ఈ విధంగా ఆంతరగిక ప్రేరణలు మానవ సంబంధాలను చెరచడమో, సరిచేయడమో చేస్తుంటాయి. వాటియెడ జాగ్రత వహించడం, శుద్ధీకరించుకోవడం, అద్దంవలె వుంచుకోవడం మానవ కర్తవ్యమని గ్రహించాలి. మరియు అంతఃప్రేరణలకూ, సాంకేతిక విజ్ఞానానికి సమతుల్యత, సమైక్యత చేకూరడం అవసరం. అపుడు సమగ్రత యేర్పడుతుంది.

# ౨౦. జీవితం పుణ్యమూ కాదు, పాపమూ కాదు.

ఎదురు చూడు నాకై మిత్రమా
విశిష్ట జీవితం గురించి చెబుతా
జీవితానికి ఏ వేదాంతమూ లేదు
ఏ కుయుక్తులు లేవు.

జీవితానికి మతాలు లేవు
మందిరాలూ, ఆరాధనలూ లేవు
జీవితానికి దేవుళ్ళు లేరు
భయంకరమైన మార్మికమైన బరువులు లేవు.

జీవితానికి నివాసం లేదు
చివరికి కృశింపజేసే వేదనా దుఃఖంలేదు
జీవితానికి ఆనందం లేదు, బాధ లేదు
వెంటబడే ప్రేమావినీతి లేదు.

జీవితం పుణ్యాం కాదు, పాపం కాదు
మురిపించే దైవ పీఠిపై విశ్రమించేది కాదు
జీవితం శక్తికాదు, పదార్థం కాదు
క్రియ, ప్రతిక్రియల క్రూరవిభజన కాదు.

జీవితానికి  చావులేదు
కాలపు ఛాయల్లో ఒంటరి తనపు లేమిలేదు
నిత్యమైన దానిలో జీవించేవాడు స్వేచ్ఛాజీవి

- జిడ్డు కృష్ణమూర్తి

సంస్థాగత ఉద్యమాలనూ, వ్యవస్థీకృత ఆచార ప్రచారాలను, వ్యక్తియొక్క గ్రంథం యొక్క అధికారాలనూ, సిద్ధాంత సూత్ర విశ్వాస అభిప్రాయాలనూ, గతానుభవ స్మృతి బంధాలను పూర్తిగా నిరసించిన వారు కృష్ణమూర్తి

**కృష్ణమూర్తి అభిభాషణ సారాంశమేమిటి?**

"కృష్ణమూర్తి భారతీయుడు కాదు. అంటే ఈ జాతికి చెందినవాడు కాదు లేక

బ్రాహ్మణ కమ్యూనిటీకి చెందినవాడుకాడు - అందులో పుట్టి వున్నా". ఇవి స్వయంగా కృష్ణమూర్తి మాటలు. అలానే జీవించారు. "జీవితంలో అన్ని స్థాయిలలో అసమానత వుంది. ఇది వాస్తవం. కానీ నేను సమాన అవకాశాలకు వ్యతిరేకిని కాను" - అని అన్నారు. "స్వేచ్ఛ, సౌఖ్యం నేను పొందాను. దీనినితరులు పొందడానికి సాయపడడం జీవిత ధ్యేయం. నా ప్రబోధం మార్మికమూ కాదు, ఇంద్రియా తీతమూ కాదు. ఎందుకంటే అవి రెండూ మానవుడు సత్యానికి పెట్టిన హద్దులు. జీవితాన్ని ఉన్నది ఉన్నట్టు అర్థం చేసుకోరు.

"స్వర్గం, నిర్వాణం, దేవుడు, జీవితం, సత్యం వీటి అన్నింటి మీద ఒక అభిప్రాయం పెట్టుకుంటారు. ఆ అభిప్రాయసాధన కోసం, దాని అవగాహన కోసం మనసుపై ఒత్తిడి తెస్తారు. దాంతో ఎన్నో విరోధాలు, బాధలు! ఆ ధోరణిలో ప్రయత్నాలు విరమణ అయ్యేస్థితికి రావాలని ఆశిస్తారు. నేను దేవుడుగా నటించను. జీవిత లక్ష్యం సంపూర్ణత్వం, ఉత్తమ మానవత్వం. అంతిమ సత్యం ఒకటి వుంది. మానవ మాత్రునిగా నేను అది సాధించాను" అన్నారు జిడ్డు కృష్ణమూర్తి. "నీవు ఎవరిని అనుసరిస్తావో, ఎవరిని పూజిస్తావో అతడు నీ వినాశకారి" అని గుర్తించు కోమని హెచ్చరించారు.

జీవితమంటే దైనందిన సామాన్య సంఘటనల అల్లిక. వాటిని ఉపయో గించుకోక పోతే చిన్న విషయాల ఉద్దేశ్యం తప్పిపోతుంది. దానిలో వుండే గొప్ప విషయాలు కూడా తప్పి పోతాయి. జీవించడం సరిగ్గా తెలిస్తే చావును గూర్చిన చింత లేదు. చావును గూర్చి చర్చించే వాడు జీవించడం లేదని అర్థం. పైగా మరణానంతర జీవితంపై ఆశలు పెంచుకుంటాడు. మరణం, జీవితం కలిసే వుండడం కృష్ణమూర్తి జీవిత సత్యం. గతించిన మానసిక విషయాలపట్ల, అనుభవాల పట్ల, భవిష్యత్‌కు పాకే ఊహల పట్ల ఎప్పటికప్పుడు విస్మృతి చెందడమే మరణం. మరణానంతరం వుండేది కొత్తజీవితం. ఈ విధంగా జీవిస్తుండగానే మరణం చవిచూస్తూ వుంటాం. జీవితం మరణమూ కలిసే సాగుతూ వుంటాయి. అప్పుడు చిట్టచివరి భౌతిక మరణం గురించి మానసికమైన భయం ఉండదు. భయం లేనివాడికి జీవితమంతా చైతన్యవంతంగా వుంటుంది. సెలయేరులా గలగలా తళతళా పారుతుంటుంది.

జీవితం వాస్తవమైంది. జీవితమే సత్యం. ఈ సత్యాన్వేషణకు విశ్వాసం, అభిప్రాయం, దైవ భావం, స్వర్గాపేక్ష, పుణ్యా పాప భయాలు అడ్డు వస్తాయి. వాటి ఒత్తిడికి లోనై మనిషి ఏ మతాచార్యున్నో, బాబానో, గురువునో ఆశ్రయిస్తాడు. ఇదంతా

వృథా. వృథాయే కాదు దగా. అంతా మోసం, వంచన, దోపిడి. సత్యాన్వేషణకు ఇది మార్గం కాదు. ఎవరిని ఎవరూ ఉద్ధరించలేరు. ఏ మతం, మఠం, పీఠం, విశ్వాసం ఏదీ సత్య దర్శనం చేయించలేదు. వీటిని నమ్ముకోవడం - కాననివాడు కానని వాడిని వూతగొనడం వంటిది. ఎవరికి వారే సత్యాన్ని అన్వేషించాలి. కనుగొనాలి. ఏ గురువూ ఎవరికీ మార్గదర్శి కాలేడు - అని కృష్ణమూర్తి మరణించినపుడు 'ఆంధ్రజ్యోతి' సంపాదకీయం (19-2-86) పేర్కొంది.

11-5-1992

## 21. ఆత్మపరిశీలన

ప్రకృతికి సన్నిహితంగా ఉండే అనువైన స్థలమది. చిన్న అరణ్య ప్రాంతమైనా ఒకవనంగా తయారయింది. ఎదిగిన చెట్లున్నాయి, ఎదుగుచున్న మొక్కలున్నాయి, పూలకుండీలున్నాయి, భూమిలో అంకురించి పెరుగుతున్న మొక్కల నారూ ఉంది. తోట, నర్సరీ గార్డెన్, చుట్టుప్రక్కల అడివి కంపచెట్లు, ఎగుడుదిగుడునేల, చిన్న చిన్న కొండభాగాలు వున్నాయి. ఈ మొత్తం కలిసి అలిపిరి కపిలతీర్థం రోడ్డు ప్రక్కనే వుంది. లోనికి ప్రవేశించడానికి చక్కని దారి ఉంది. ముఖ్యమైన దారి నుండి అటూ ఇటూ అడ్డదార్లూ ఉన్నాయి. ముఖ్యమైన దారినే పోతే కొండభాగం ఎక్కడానికి చక్కని మెట్లున్నాయి. మెట్లు పూర్తికాగానే చదును చేయబడ్డనేల, ప్రక్కనే ఒక కుటీరం ఉండడంతో కూర్చోవాలనిపిస్తుంది. చుట్టూ గాలి వీస్తుంది, చుట్టూ బాగాకనిపిస్తూంది.

ఆ కుటీరంలో ప్రతి సోమవారం సాయంసమయంలో చేరుతున్నారు కొందరు విశ్రాంత జీవనులు. ఏదో మాట్లాడుతూ ఉంటారు. వాటికి ఆధ్యాత్మిక విషయాలనీ, దైవ విషయాలనీ పేరు పెడుతుంటారు. అందులో తెలిసిన వాటికన్నా, తెలియనివే ఎక్కువుంటాయి. కాని తెలిసినట్లే మాట్లాడుతుంటారు.

మాట్లాడడం మొదలు పెట్టగానే లేక మాట్లాడదలచిన విషయాలు మనసులోకి రాగానే, లేక మనసునిండా ముందుగానే కొన్ని అభిప్రాయాలు చేరి ఉండగానే ప్రకృతితో సన్నిహితంగా ఉండడం ఆగిపోతుంది. శారీరకంగా, భౌతికంగా ప్రకృతి మధ్య ఉండడంతో పాటు, ఖాళీ మనసుతో దాన్ని చూడగలిగితేనే, స్పందించగలిగితేనే సాన్నిధ్యంలో ఉండడమవుతుంది.

మాట్లాడుకోడానికి కలవడం జరిగింది గనుక, 'ఆత్మపరిశీల' గూర్చి చర్చించాం. ఆత్మ పరిశీలన, దాని ఉద్దేశం, దాని ప్రయోజనం, అందుకు వేరే మార్గాలున్నాయా అనే విషయాలు రమణమహర్షి, గణపతిమునికి వివరించారు.

ఆత్మ అనేది ఈ దేహానికి, మనసుకు, బుద్ధికి, అహంకారానికి వెనుక మూలమై ఉన్న వస్తువని ముందుగానే చెప్పడమైంది. పరిశీలన ఉద్దేశం ఆత్మను తెలుసుకోవడం; వికారం లేని ఆనందం పొందడం. కొన్ని మార్గాలద్వారా మహిమలు కలిగినా అవి నిష్ప్రయోజనం. వాటి ద్వారా ఆత్మా తెలియదు, ఆనందమూ కలుగదు. ఇదీ సారాంశం. ఇది ఇంచుమించుగా అందరికీ తెలుసు. అయినా దాన్ని ఖాయపరచుకోడానికి, సాధించుకోడానికి అన్నట్లు సంభాషణ.

ఆత్మ అన్నిటికంటే మూలమైందనీ, పరమాత్మలో భాగమనీ, అది దైవమో దైవాంశమో అని అనుకోవడం చాలా తేలిక. ఎందుకంటే ఈ విధంగా చెప్పే మనుషులు చిన్నప్పటినుంచీ కాచుకొని ఉన్నారు. ఈ విషయాలు నొక్కి నొక్కి చెప్పే పుస్తకాలు అనేకమున్నాయి. మనం అలాంటి భావాలతోనే మొదటి నుంచీ తయారయ్యాం. అదొకవృత్తి, సంప్రదాయం, గౌరవం, పరిశీలనంటే ఇదేనా? పరిశీలించే వైనం ఏమిటి?

చెప్పింది అంగీకరించడం పరిశీలనకాదు. నమ్మకం, సాధన కలిగి ఉండడం పరిశీలన కాదు. వస్తువూ, ఫలితమూ, ప్రయోజనమూ ఫలానిదని ముందుగానే ఊహించుకోవడం పరిశీలన కాదు. ఎవరో చెప్పింది పరిశీలన కాదు.

పరిశీలనా వస్తువుపై దృష్టి పెట్టటంకన్నా, పరిశీలన ఎలా చేయాలో నేర్చుకోవడం చాలా ప్రధానం. ఫలానదానిని గురించి ఆలోచించమని చెప్పడం పరిశీలన కాదు.

ప్రశ్నవేసుకుంటూ దానికి సమాధానం తన అనుభవానికి తగినట్లుగా, వ్యవహరించడానికి వీలయినట్లుగా, వాస్తవంగా, నిత్యజీవితంలో జరుగుతున్నట్లుగా ఉంటే, పరిశీలన యథార్థంగా సాగుతున్నట్లు. అది సత్యం యొక్క లోలోతులకు తీసుకొనిపోతుంది. సమాధానం చిక్కకపోతే, తీవ్రత, ఆసక్తి పెంచుకోవాలి. అదే సమస్యపై నిలబడాలి. అంతకుమించి తెలియందానిని తెలిసినట్లుగా ఊహించరాదు. నిజమైన శ్రద్ధ ముమ్మందుకు తీసికొని వెళ్తుంది. అది సహజంగా ఉంటుంది.

ఇక్కడ ఆత్మ - నేను ఒకటే. మన అనుభవంలో ఉన్నంతవరకూ 'నేను'

అంటే ఈ శరీరమూ, మనసూ, హృదయం, బుద్ధి, భావాలూ, జ్ఞానమూ, అనుభూతులూ - అన్నీ కలిసి 'నేను'. వ్యాపించినవి వ్యాపించినట్లుగా, అణగారినవి అణగారినట్లుగా, విజృంభించినవి. విజృంభించినట్లుగా ఉన్నవి ఉన్నట్లుగా తెలిసి కొనడమే నన్ను నేను తెలిసికొన్నట్లు. ఆ తెలిసికొన్న విషయాల సంపుటే ఆత్మజ్ఞానం. అది ఎప్పటి కప్పుడు, ఏ క్షణానికి ఆక్షణం జురుగతుండాలి. ఇప్పటి నాస్థితి నాకు తెలిసి ఉండడమే ఆత్మ పరిశీలన ద్వారా, ఆత్మ జ్ఞానం కలిగి ఉండడం. నా ద్వేషాలూ - ప్రేమలూ, నా ఇష్టాలూ - అపోహలూ నాకు తెలిసి ఉంటాయి. నా స్థితి నాకు నిజంగా తెలుస్తుంటుంది. దాన్నిబట్టి నా తీరు, నాకు గుణపాఠంగా వుంటుంది. ప్రస్తుత స్థితి, సత్యం ఎరుకలో వుంటుంది. అవసరమైన మార్పు కోరకయే జరుగుతూంటుంది. అది స్పష్టతను, వెలుగును, సరళతను, నిజాయితీని ఇస్తుంది. అంతకు మించిన సంతోషం ఏంకావాలి పిల్లలకు గానీ పెద్దలకు గానీ?

ఇంకాలోపల, లోతులో, మూలంలో ఏదైనా ఉంటే ఇప్పుడు అవ్యక్తంగా ఉన్నదేదైనా ఉన్నాకూడా పరిశీలన స్వచ్ఛందంగా, స్వేచ్ఛగా సాగుతుంటే దానంతటికదే విచ్చుకుంటుంది. పువ్వు పూర్తిగా వికసించగానే దానంతటికదే సువాసనా, సౌందర్యమూ వెదజల్లుతుంది.

# వ్యక్తిమారితేనే సమాజం మారుతుంది

**కలయిక ఉద్దేశం :**

మనల్ని మనం అర్థం చేసుకోడానికి సభలు, సమావేశాలు చేస్తున్నాం. ఇవి మన అవగాహన పెరగడానికి తోడ్పడతాయి. మనల్ని మేల్కొల్పుతాయి. చైతన్యం కల్గిస్తాయి. మన సంబంధాలను మెరుకుచేసుకోడానికి, సమీక్షించుకోడానికి, సరిచేసు కోడానికి, ప్రయోజన పరుచుకోడానికి దోహద పడతాయి. నేనేమిటో, నా సంబంధ మేమిటో, నా సమాజమేమిటో నాకు బోధపడుతూ ఉంటుంది. నేను - నా చుట్టున్న జనం - పరస్పర సంబంధం మన అవగాహనలో ఉన్నాయి. వాటి అనుభూతి ఇప్పుడు, ఇక్కడ మనకు ఉంది. ఎక్కడైనా, ఎప్పుడైనా ఏదో రకమైన అనుభూతి అంటూ వుంటుంది. ఇది వాస్తవం.

**నేను - సంబంధం :**

నేనంటే వ్యక్తి. సమాజం అంటే సంబంధిత జనం. ఇవి కనపడుతున్నాయి. కనపడకుండా మరొకటి ఉంది. అది మనకు తెలుస్తోంది. అది సంబంధం. సంబంధంతో సమష్టి ఏర్పడుతోంది. వ్యక్తి జీవిస్తున్నాడంటే సంబంధంలో ఉన్నట్లు తేటతెల్ల మవుతోంది. కాబట్టి వ్యక్తుల సంబంధంతో కూడింది సమాజం. వ్యక్తుల వ్యాపకత్వం సమాజం అని చెప్పవచ్చు. వ్యక్తమైనవాడు వ్యక్తి. వ్యక్తిత్వం ఎలా వ్యాకోచిస్తుందో, ఎలా సంకోచిస్తుందో చూద్దాం.

**నేను - మనసు:**

నేను స్థానంలో దేవుణ్ణి పెట్టినా, దేశం చేర్చినా, విజ్ఞాన (scientific knowledge) కుమ్మరించినా అలజడి మరింత వ్యాపకం కావడమే అవుతుంది. అది మనసుపైపడే మరో విచ్ఛిన్నకర విజృంభణ కాగలదు. 'నేను' లేకపోతే మిగిలేది జడత్వం కాదు. 'నేను' పోతే చూసేదృష్టి పోవడం కాదు. ఎందుకంటే 'నేను' తో చూడడం ఒకటుంది. 'నేను' లేకుండా చూడడం కూడవుంది. కేంద్రం పోతే, వలయం పోతుందిగాని, అవకాశం పోదు. అవకాశం అనండి, ఆకాశం అనండి అది అనంతంగా విస్తరిస్తుంది. జైలు గోడలు బ్రద్దలౌతాయి. అంతే.

**మనిషి - వ్యక్తి :**

మనిషి అంటే జీవరాసుల్లో తెలివి అనేప్రత్యేకతతో గుర్తింపబడిన జీవుడు. మనిషి అనేది సామాన్య పదం. అదే మనిషిని వ్యక్తి అంటున్నాం. అంటే ఒక విశేష లక్షణంతో గుర్తించి, వ్యక్తి అనే పదం వాడుతున్నాం. సమాజంలో మనుషులున్నారని చెప్తున్నాం. కొన్నిలక్షణాలతో వ్యకమైన వాడు వ్యక్తి. నిజానికి Individual అంటే Indivisible - అవిభాజ్యమైన వాడని అర్థం. అంటే సమగ్రతగల వాడు.

మనిషంటే దేహం, జీవం, మనసు, హృదయం, సంబంధాలు గలవాడు. వాటి యొక్క వ్యక్తీకరణ ద్వారా వ్యక్తి ఏర్పడుతున్నాడు. ఆవ్యక్తీకరణ 'నేను'. నేను అనేది భౌతికంగా, మానసికంగా, సంబంధ పూర్వకంగా, సామాజికంగా, 'ఆత్మ'గా, అహం కారంగా, మత పరంగా, రాజ్య పరంగా జాతి పరంగా, కుల పరంగా, అనేక రీతుల బహిర్గత మౌతోంది. ఇచ్ఛా ప్రయత్నాలతో 'నేను' బలపడుతూ వుంటుంది.

ఇందులో కొన్ని వాస్తవ రీతులున్నాయి. కొన్ని అవాస్తవ - ఊహాత్మక - రీతులున్నాయి. వీటి నర్థం చేసుకుంటే వ్యక్తి యొక్క వ్యాకోచ సంకోచాలు తెలుస్తాయి. 'నేను' అనేది దైహికంగా, ప్రవర్తనా పరంగా ప్రేమాను బంధాల మూలంగా, ద్వేష భరితంగా వ్యక్తమైతే అది వాస్తవిక మని తెలుస్తోంది. 'నేను' లేదా 'ఆత్మ' అన్నపుడు 'తాను' లేక 'నిజ' అని అర్థం. అలాగాక ఆత్మ (నేను) అనేది విశ్వాత్మనో, పెద్ద ఆత్మ అనో, పరమాత్మలో భాగమనో అంటే అది ఊహాత్మకంగా ఉంటుంది. అనుభూతి పరంగా తెలిసేదికాదు. మాట వినికిడితో పరిమితమై పోతోంది. అందుచే అవాస్తవమనిపిస్తోంది.

### వ్యక్తి - అహం

మరో రకంగా అర్థం చేసుకుందాం. వ్యక్తిత్వం అహం భావంతో కూడి వుంటుంది. అహంతో కూడిన 'నేను'కు అనేక రూపాలున్నాయి. దాని స్వార్థపూరిత రూపాలు, విచ్ఛిన్నకరరూపాలు ఎంతగా విజృంభిస్తే లోకంలో అది అంతగా వ్యాకోచిస్తుంది; అలజడి, విచ్ఛిత్తి పెరిగి పోతాయి. అహం తరిగితే, సమగ్రత ప్రసన్నత, పెరుగుతాయి. ఛిద్రత తరుగుతుంది. ఈ విధంగా అహం యొక్క వ్యాకోచ సంకోచాల ప్రభావం మనకు తెలుస్తుంటుంది. మనిషి యొక్క అంతర్గతం కార్యరూపేణ బహిర్గతం అవుతుంటుంది. లోని సమస్యే బయటి సమస్య. లోపల ప్రసన్నత ఉంటే ప్రపంచంలో శాంతి ఉంటుంది. సమస్యకు ప్రసన్నతకు మూలం మనస్సే. అంటే వ్యక్తియే సమస్య. వ్యక్తి ద్వారా లోకంలో అలజడి పుడుతోంది. అందుచే దాన్ని తొలగించు కోవలసిన అవసరమూ కర్తవ్యమూ మనిషికి ఏర్పడ్డాయి. సమాజం యొక్క బాధ్యత మనిషిది అని అర్థమవుతోంది.

### స్వార్థం - విభజన :

అహం అనగా స్వార్థమని తెలసింది. స్వార్థం యొక్క లక్షణం విభజించి చూడడం. తాను వేరైపోవడం. తన గుర్తింపు నిమిత్తం దేనికైనా సిద్ధపడడం, అవినీతికి లోబడడం. దాని విస్తార రూపాలేమిటంటే -సంపాదన, అనుకరణ, విజయాసక్తి, ఈర్ష్య, ద్వేషం, లోభత్వం, భయం. ఇవి మనసు నాణ్యతను కుంచింపజేస్తాయి. మనసు స్వార్థపరత్వాన్ని వ్యాపింపజేస్తాయి. కనుక మనసు ఆకాంక్షలతో, ఆశలతో, తత్సంబంధ సిద్ధాంతాలతోసంబంధ వైరుధ్యాలతో ముక్కలు చెక్కలై పోతోంది. ఘర్షణ స్వభావం అలజడి. స్వార్థంవల్ల విభజన, విభజనవల్ల ఘర్షణ, ఘర్షణవల్ల అలజడి - ఇదీ వరస.

కనుక విభజన లేకపోవడమే సమగ్రత.

**ఘర్షణ :**

అవాస్తవాలు, స్వార్థ చింతనలు, విభజన, అహంభావం - ఇవన్నీ మనసులో లేపే కలతల ప్రభావం ఘర్షణ. అన్నిటికీ మూలం అహంకారం యొక్క వ్యాకోచం. ఘర్షణయొక్క ప్రాథమిక నెలవు మనసు. మనసుకు, సంబంధించిన ఆలోచన, జ్ఞానం, స్మృతి, గతం ఘర్షణను పెంచిపోషించే వలయాలు. ఘర్షణయొక్క రూపం హింస. ఘర్షణయొక్క ఫలం దుఃఖం. ఘర్షణయొక్క ప్రభావం అశాంతి. కనుక సమాజంలో హింస, దుఃఖం, అశాంతి, తాండవించి ఉండడం వాస్తవంగా గమనిస్తున్నాం. అవి మనిషి కున్న అన్ని సంబంధాలలోనూ ప్రత్యక్షమౌతుంటాయి. ఘర్షణవల్ల మెదడు మిషన్‌లాగా అరిగి పోతుంది. నరాల జబ్బు వస్తుంది. మనిషి శక్తిహీనుడై పోతాడు. నిస్సహాయత ఆత్మహత్యకు దారితీస్తుంది.

**స్వార్థం - అవినీతి :**

స్వార్థం అంటే అవినీతికి మూలం. ఘర్షణ అంటే మనశ్శాంతికి విచ్ఛితి. ప్రేమ, ప్రజ్ఞ, కరుణ, శాంతి స్థితులకు, ఘర్షణ గొడ్డలిపెట్టు.కనుక దాన్ని తొలగించు కోవలసిన అగత్యాన్ని గుర్తించాం. ఘర్షణ తొలిగితే మనిషిని మనిషి వాడుకోవడం తగ్గుతుంది. వాడుకోవడం అనేది సొంత సంతృప్తికి సంబంధించింది. ఘర్షణలేని మనసులో స్థిమితత్వం, చేతనత్వం, సృజనత్వం ఏర్పడతాయి. అపుడు బయట మేలైన మానవ సంబంధాలు, స్వేచ్ఛ, శాంతి, సంక్షేమం ఏర్పడతాయి. అదే నవీన సమాజం. అవినీతి సమాజంలో, సంప్రదాయకులు, మర్యాదస్తులు, ధనవంతులు, అధికారులు, ఆశపరులు 'మంచి పౌరులుగా సర్దుకుపోతూ ఉంటారు. వాళ్ల నెదిరించే వారు నవీన సమాజ మానవులవుతారు. సహజ నీతిపరులు, నిజంగా తెలివైన వారు, అసలైన స్వతంత్రులు, విముక్తులు బయటి కొస్తారు. ఈ నాడు సమాజాన్ని పట్టి పీడిస్తున్నది ధనకాంక్ష, అధికారబంధం, కీర్తి ఖండూతి, అత్యాసతో మోక్షం వెంట పడడం. వాటిని సరిగా అవగాహన చేసుకోవడం నవీన సామాజికుల పని. కోరిన మార్పు రావడం లేదని నిరుత్సాహపడే వారున్నారు. నీరు కారిపోతు న్నారు. సమాజంలో ఉండేకన్నా సమజం (జంతుసమూహం)లో మెలగడం మేలంటున్నారు.

వ్యష్టి - సమష్టి :

అయితే పరివర్తన ఎక్కడ మొదలవ్వాలి. ఈ విషయం లోతుగా చూడ వలసిన అవసరముంది. మార్పు యొక్క ఆవశ్యకతను గుర్తించాం. మార్పు వ్యష్టిలో కలగాలా లేక సమష్టిలో కలగాలా? ప్రాచీన భారతీయుల దృష్టి ప్రకారం సమష్టికన్నా వ్యక్తి ముఖ్యం.

వ్యక్తి ఉనికి, వ్యక్తి భావం, వ్యక్తి మోక్షం, ప్రధానం. సామాజిక స్పృహ అనేది కుటుంబరీత్యా వచ్చింది. అది ఒక నిబంధనావళి రూపంలో కాలక్రమేణ వచ్చింది. 'సర్వేజనాః సుఖినోభవంతు' అనేది గాని, 'వసుధైక కుటుంబం' అనేది గాని ఒక ఉదాత్త భావం. సామాజిక నిర్మాణం అంత ఎత్తుకు ఎదగడలేదు. ప్రాచీన సమాజం, వర్ణ వ్యవస్థపై ఆధార పడినట్టిది. అదే మరోరూపంలో ఇప్పుడూ కొనసాగు తోంది.

వర్ణవ్యవస్థ వేదోపనిషత్తుల తర్వాత వచ్చిన స్మృతుల కాలంలో స్థిరపడింది. వర్ణవ్యవస్థలో వ్యక్తిగత నిష్ఠ మొత్తం ఆవర్ణానికి చెందుతుంది. ఏ వర్ణసమూహానికి ఆవర్ణసమూహం ఉంది. అలాగే వర్ణ మోక్షాదులపై ఆసక్తి ఉంది. సామాజిక పరివర్తన అంటూ వర్ణవ్యవస్థలో లేదు. వ్యక్తిగత వికాసం వర్ణభావవలయానికి పరిమితమై ఉంది. అథమవర్ణం నుండి అగ్రవర్ణానికి మార్పు చెందడమనేది కలలోని మాట. ఈనాడు కూడ అలాంటి (కులం) మార్పు లేకపోయినా, సామాజిక ఐక్యతలో కొంత చైతన్యం వచ్చింది. వ్యక్తి ముఖ్యమా సమాజం ముఖ్యమా అనే ప్రశ్న ఉదయించింది. అది బహుళ విశేష అర్థాన్ని సంతరించుకొన్నది. వ్యక్తి వర్సెస్ సమాజం అనే భావన బహుశ కారల్ మార్క్స్ తర్వాత గాఢంగా మేథావుల్లో జనించి ఉంటుంది. మార్పు, విప్లవం అనే పదాలు ప్రబలంగా ప్రయోగంలో ఉన్నాయి. సమాజం మార్పును కోరుతోంది, సమాజాన్ని మార్చాలి. అనే నినాదాలెక్కువైనాయి. సమాజం మారితే వ్యక్తి మారతాడు అనే ఉద్దేశ్యం అంతర్లీనంగా ఉంది. అలా ఉద్యమాలు నడుస్తున్నాయి. అయితే ఈ మార్పు స్థూలంగా ఆర్థిక పరమైంది, చట్ట పరమైంది. హక్కుల - బాధ్యతల మెరుగుదలకు సంబంధించింది, సామూహికమైంది.

సమూహంపై ఆధారపడడం వ్యక్తి అంతర్గత వికాసానికి సంబంధించింది కాదు. అందుకు అవకాశం తక్కువ. 'వ్యక్తి మారితే గాని సమాజం మారదు' అని మనం చర్చిస్తున్నామంటే ఇది మానసిక పరివర్తనకు, మానసిక ఔన్నత్యానికి సంబంధించిన విషయం. మనం కోరేది మానసిక మార్పు (mental transformation) లేక మానసిక

విప్లవం. (Psychological revolution or radical change) లేక ఉత్పరిణామం (mutation). మార్పు చెందిన మనుషుల సంఖ్య పెరిగి నపుడు సమాజం వినూత్నీకరించ బడుతుంది. వ్యక్తిలోని మార్పు యొక్క ప్రభావం అన్ని రంగాల్లోనూ ఉంటుంది. ఇదీ ఈ చర్చ నీయాంశం లోని అర్థం.

**సమాజం :**

వ్యక్తులతోనూ వాళ్ల లక్షణాలతోనూ వాళ్ల సంబంధాలతోనూ కూడింది సమాజం. అనేక విడి భాగాల్ని కలుపుకుంటే గాని ఒక బస్సు నిర్మాణం జరగదు. బస్సును మార్చాలంటే విడి భాగాలను రిపేరు చేయడమో, క్రొత్తవి వేయడమో జరగాలి. బస్సు మొత్తాన్ని ఒక యూనిట్‌గా తీసుకొని మార్చలేము. పాతబస్సు స్థానంలో కొత్త బస్సును పెట్టినా, ఆ కొత్త బస్సు విడి విడి కొత్త పార్టులతో కూడిందే. కాబట్టి మార్పుకై వ్యవహారం చేసేది విడి భాగాలతోనే. అలాగే సమాజంలో మార్పుకై పని చేయాల్సింది వ్యక్తితోనే. వ్యక్తిని పట్టుకోవాలి. వ్యక్తి మనసును మార్చాలి. మనసు వ్యక్తికి పరిమితమైందని కాదు. మనసు ప్రవాహ రూపలో ఉండొచ్చు. గాలి, నీరులాగ సర్వత్ర ఉండొచ్చు. కాని మార్పు చేసేది మానసిక ప్రేరణతో జరిగే వ్యక్తి ప్రవర్తనలోనే కాబట్టి వ్యక్తి మారాలి. అపుడు సమాజంలో వచ్చే మార్పు సహజంగా ఉంటుంది. మానసిక మార్పు మానవుని అన్ని క్షేత్రాలలోనూ అదే రీతిలో పని చేస్తుంది.

ఈ సమాజంల సంప్రదాయం, మతం, ధనం, ఈర్ష్యా భయాదులతో కాస్త ప్రేమతో రూపొందింది. అలా సమాజం అవినీతి మయం. కాబట్టి లోలోన క్షీణిస్తుంది. ఆ సమాజ ప్రభావంలో ఉండే మనసు కూడ అవినీతికరంగా ఉంటుంది. మనిషిని బుద్ధి పూర్వకంగా అగౌరవించే సమాజం స్వయం నాశనకారి. సామాజిక నీతి అంటే మర్యాద. ఆశ - జులుం - క్రూరత్వం - ఆదర్శంగా చంపడం మర్యాదలో భాగం. మర్యాదస్తుని మంచి పౌరుడంటారు. కాని సమాజాన్ని మార్చేది తెలివైన మానవుడు; అవినీతిని వ్యతిరేకించే ఆసక్తి గలవాడు; అంతర్గతమైన మనిషి. మర్యాదగా మెలిగేవాడు బహిర్గతమైన పౌరుడు. ఈ ఇద్దరికి సమన్వయం కుదరాలి.

**ప్రభుత్వం - ఉద్యమాలు :**

ఈ రోజుల్లో ప్రజలు ప్రభుత్వ అధీనంలో వున్నారు. ప్రభుత్వ చట్టాల పరిధిలో

పనిచేస్తున్నారు. ప్రభుత్వాధికారం మానవ జీవన రంగాలను నిర్దేశిస్తోంది. అలాగే ఉద్యమాలు, సామూహిక చర్యలు ఎక్కుమంది ప్రజలను కదిలిస్తున్నాయి. మెజారిటీ మనస్తత్వం ఆ విధంగా పెరిగిపోయింది. కనుక చట్టం ద్వారానూ, భౌతిక విప్లవాల ద్వారానూ మార్పుతేవచ్చు - మంచికా చెడుకా అనేది వేరే విషయం. ఈ సామూహికోద్యమ మార్పు అప్పటికున్న వ్యక్తిగత స్వభావానికి వ్యతిరేక మైంది. అంటే అలాంటి మార్పుకు ముందుగా సమాయత్తమై ఉండని మనస్తత్వానికి వేరైంది. అందుచే ఈ మార్పుయాంత్రికమైంది. ఘర్షణతో కూడింది. బలవంతంగా సర్దుబాటు చేసుకొనేది. హింసకు తావైనది. భౌతిక విషయాలకు కట్టుబడ్డది. కాన ఎక్కువ కాలం నిలబడదు. మానసికంగానూ, మ్యుటేషన్ (Mutation) ద్వారానూ, తద్వారా భౌతికంగాను వచ్చే మార్పు నిజమైంది. ప్రవర్తన ద్వారా సహజ పరివర్తనతో వచ్చే మార్పు బహుకాలం కొనసాగుతుంది. అది కూడ ఎప్పటికప్పుడు అర్థవంతంగా, ఎరుకతో, చైతన్యంతో మార్పు చెందుతూ ఉంటుంది. మార్పు నిత్యచైతన్యంగా ఉండాలి. నిరంతరం సాగాలి. మానవుడు ప్రకృతికి ఎంత సన్నిహితంగా పుట్టాడో రాను రాను అంతదూరమైన పోతున్నాడు. ఈవికృతి ధోరణి నుండి కూడ మార్పు చెందడం ఎంతైనా అవసరం.

### వ్యక్తి మార్పే సామాజిక మార్పు

వ్యక్తి మార్పే సామాజిక మార్పు అనేది మనకు ద్యోతకమవుతోంది. మన అనుభూతి అలాగే చెప్తోంది. ఆయనుభూతి లోతులు బహిర్గత మైతే, మన మనసుకు హత్తుకుంటాయి. వివరంగా కనపడతాయి.

వ్యక్తి మారందే సమాజం మారుతుందా? అలాగాక మరోమార్గం ఏమైన ఉందా. యోచించండి. పరిశీలిద్దాం. ప్రకృతివల్లగాని, దైవికంగా గాని, సైన్సు సృష్టించే బీభత్సం వల్లగాని వ్యక్తిలో మార్పు వస్తుందా? మొత్తం మానవాళి తుడిచి పెట్టుకు పోతే ఊహించలేం. ఏ ఒక్కడు మిగిలినా అతని నిబద్ధ రూపమైన మనసే - ఆలోచనే - తదనుగుణంగా సమాజాన్ని నిర్మాణం చేస్తుంది. ఏ అవతార పురుషుడో సమాజాన్ని మార్పు చేస్తాడని ఎదురు చూడడం వృథా. నిబద్ధమైన మనసును బ్రద్దలు చేయడం మనిషి నేర్చుకోవాలి. ఎందుకంటే నిబద్ధత కాఠిన్యం తెస్తుంది. కాఠిన్యం ద్వారా హింస పునాదిగాగల సమాజం తయారవుతుంది.

మారే స్వేచ్ఛ వ్యక్తికి ఉంది. సమాజానికి దూరంగా ఉండే స్వేచ్ఛకూడ ఉంది. మార్చేశక్తి కూడ మనిషికి ఉంది. సమాజం వ్యక్తిని లోబరచు కొంటుంది గాని స్వేచ్ఛ నివ్వదు. స్వేచ్ఛలో గాని సహజ సిద్ధమైన మార్పురాదు. బలహీనుడు సమాజం మారితేగాని మారలేడు. బలవంతుడు సమాజాన్ని ఎదిరిస్తాడు, మారతాడు. సహేతుకంగా ఉంటాడు. భయం ఉన్నపుడు, సమాజం మీద ఆధార పడినపుడు స్వేచ్ఛ లభించదు. ఇది గుర్తించాలి. జాతీయత, దేశభక్తి, సంకుచిత పరిచే మతాలోచన నుండి స్వేచ్ఛ పొందాలి. (Life Ahead - 59,60)

మార్పుకు ఇష్టపడని సమాజం కుక్కలాంటిది. వ్యక్తి మారడం జూసి 'భౌ భౌ' మంటుంది. దానికి రొట్టె ముక్కైనా వెయ్యాలి.లేదా గట్టిగా తరిమి కొట్టాలి. పట్టించుకోకుండా, తనకు తాను పటుత్వంగా ఉండడం కూడ జరుగుతుంది.

**కొత్త సమాజం :**

సమాజంలో మార్పు కోరే మనుషులు ఆశ - పోటీ -కాఠిన్యత బిడ్డలకు నేర్పరాదు. ప్రత్యేక ప్రయోజనం మీద ఆధారపడి చెప్పే చదువులు తమ బిడ్డలకు చెప్పించరాదు. విద్యా విప్లవం విస్తృతమైతే సమూలమైన మార్పుతేగలదు. చెడు సాధన ద్వారా మంచి చేకూరదు.

నమ్మకాల్లోనూ, సిద్ధాంతాల్లోనూ చిక్కుకొనని సుఖవంతుడు మాత్రమే కొత్త సమాజాన్ని తేగలడు (COL II-70). చేస్తున్న దానికి చేయదలచిన దానికి మధ్య యుద్ధం లేనపుడు జీవించడం ఉంటుంది, ఆనందం ఉటుంది.అది సంపూర్ణమైన విప్లవాత్మక అద్భుతం. అతడు తోటమాలినైనా ప్రధానమంత్రి నైనా ఒకే రకంగా ప్రేమిస్తాడు. సృజనాత్మకంగా ఉంటాడు (TMOC - 64). సృజనాత్మకత అంతః సంపదనుండి పుట్టు కొస్తుంది. అనుభవిస్తున్నట్లు తెలియనిదే సుఖం. విలాసం, వినోదం, విశ్రాంతి, విజయం సుఖాలుకావు. నిజం తెలసుకోవాలనే తీవ్రమైన ఆసక్తి వుండాలి. నిజాయితీగా ఉండాలి. సరళంగా ఉండాలి. అలా జరిగే సత్యావగాహన కొత్త సమాజాన్ని సృష్టిస్తుంది (TMOC - 139). నిత్యజీవిత పరిశోధనలో నేను నాది అనే దానికి చోటులేదు. అది లేనపుడే కదా నిజమైన ప్రేమ ఉండేది. 'నేను' లేనపుడు మాత్రమే అందం, ఆనందం ఉంటాయి. అంతేకాదు నైపుణ్యా ముంటుంది. స్పష్టత ఉంటుంది, కరుణ ఉంటుంది, తెలివి ఉంటుంది. అవి నూతన సమాజానికి పునాది రాళ్లు.

క్రమశిక్షణ :

నూతన సమాజానికి క్రమశిక్షణ ఎక్కడ నుండి వస్తుంది. పరిశీలించడం నుంచీ, అప్రమత్తతనుంచీ, ఆశ - భ్రమ రాహిత్యం నుంచీ శిక్షణ జాగృత మౌతుంది. అది స్వయం శిక్షణ, క్రమశిక్షణ. అది ధర్మపరమైన, నిజమైన మతపరమైన మనసుకే సాధ్యం. ప్రశ్నిస్తూ స్వయంగా అవగాహన చేసుకొనే మత పరమైన మనసుండటం వేరు, ఒక మతాన్ని అనుసరించడం వేరు. అనుసరించే మనసు అనుకరణతో కూడిన మనసు మార్పు తీసుకురాలేదు. రాజకీయంగా, సామాజికంగా, నైతికంగా, మతపరంగా పెద్ద గందర గోళం ఉంది. అది నిత్యజీవితంలో సంగ్రామం చెలరేపుతోంది. అలా జీవించడాన్ని అధిగమించే మనస్తత్వం, పొందిక కావాలి.

మార్పువల్ల ప్రేమ :

కాబట్టి మనజీవితాల్లో మార్పు సాధ్యమా అని చూసుకోవాలి. నిత్య జీవితంలో సంపూర్ణ మార్పు సిద్ధించకుండా దేవుని గూర్చి, సత్యం గూర్చి అన్వేషించడం గానుగెద్దు పోకడవుతుంది. దారులు వెదకడం, గ్రంథాల వెంట పడడం, బోధకులననుసరించడం ప్రక్కన బెట్టి తనలోకి తాను చూసుకోవాలి. తనను తాను అర్థం చేసుకోవాలి. తనను తాను ప్రేమించగల మనిషి ఇతరులను కూడ ప్రేమించగలడు. ప్రేమించాలంటే ప్రేమకు వ్యతిరేక మైన వాటన్నిటికి తిలోదకాలివ్వాలి. అపుడే ప్రేమ ఏర్పడుతుంది. పెద్ద మనసు ఏర్పడుతుంది. విశాల దృక్పథం యేర్పడు తుంది. నిశ్చల స్థితి కల్గుతుంది. గాయపడని మనసు సమగ్రంగా పనిచేస్తుంది. సమాజ సంక్షోభాలను తీర్చుతుంది. కొత్త సమాజానికి నాంది పలుకుతుంది.

మార్పు చెందిన మనుషులు మాత్రమే ప్రపంచ మార్పు తీసుకు రాగలరు. వ్యక్తులెందరో అలా జేశారు. క్షీణిస్తూ ఉన్నా, మార్పుకు అర్రులు చాసే గుణం సమాజానికి ఉంది. కనుక మార్పు వైపుకు పయినించడం, మార్పు కల్గించడం మానవ కర్తవ్యం.

కృష్ణమూర్తి మారారు :

ఒక కృష్ణమూర్తి మారారు. ఎందరినో మార్చారు. వారి ప్రభావం బహుకాలం లోకంలో సున్నితంగా, సన్నిహితంగా, సైలెంటుగా పనిచేస్తుంది. మారారని ఎలా

చెప్పుకోవడం? ఇలా, ఆయన మాటల్లో :

"జె. కృష్ణమూర్తి అనే వ్యక్తి వున్నాడు. అతనికి ఒక ధ్యేయం ఉంది. దాని అన్వేషణలో పోరారాటాలు, దుఃఖాలు, బాధలు అనుభవించాడు. అనేక మార్గాలు శోధించాడు. తర్వాత పర్వత శిఖరాగ్ర దర్శన మైంది. అదే ప్రియతమునితో ఏకం కావడం, Union with the beloved; అదే విముక్తి".

"ఇప్పుడు నా దాహంతీరింది .... వెలుగు చూశాను. దుఃఖనివారకమైన కరుణ స్పృశించాను, నా కొరకే కాదు ప్రపంచం మొత్తానికి సత్య దర్శనమయింది. చీకటుతొలిగాయి. మహిమాన్వితమైన ప్రేమతో నా హృదయం మత్తెక్కింది ....

"నేను బ్రాహ్మణవర్గమను దానిలో పుట్టినా, బ్రాహ్మణుడనుకాదు. భారత దేశంలో పుట్టి నా భారతీయుణ్ణి కాదు" అని ప్రకటించాడు. అలా బ్రతి కాడు.

"నేనెల్లపుడు చాలా పరిశుభ్రంగా వున్నాను .... ఒక కట్టెలా నా దేహాన్ని అగ్నికి ఆహుతి చేయాలి. నాకు జాతీయత లేదు. ఎలాంటి ప్రార్థనలు, ప్రసంగాలు, హడావుడులు, ఆరాధనలు, ఆచార క్రియలు ప్రదర్శనలు, ప్రజాదర్శనాలు వద్దు.

ఈవిధంగా జిడ్డు కృష్ణమూర్తి విశ్వమానవతామూర్తి అయినాడు.

జీవన దర్శన స్ఫూర్తి
వసుధైక కుటుంబ వర్తి
తాత్త్విక యుగ చక్రవర్తి
అతడే, మన కృష్ణమూర్తి.

20-11-1999

చెప్పుకోవడం? ఇలా, ఆయన మాటల్లో :

"జె. కృష్ణమూర్తి అనే వ్యక్తి వున్నాడు. అతనికి ఒక ధ్యేయం ఉంది. దాని అన్వేషణలో పోరారాటాలు, దుఃఖాలు, బాధలు అనుభవించాడు. అనేక మార్గాలు శోధించాడు. తర్వాత పర్వత శిఖరాగ్ర దర్శన మైంది. అదే ప్రియతమునితో ఏకం కావడం, Union with the beloved; అదే విముక్తి".

"ఇప్పుడు నా దాహంతీరింది .... వెలుగు చూశాను. దుఃఖనివారకమైన కరుణ స్పృశించాను, నా కొరకే కాదు ప్రపంచం మొత్తానికి సత్య దర్శనమయింది. చీకటుతొలిగాయి. మహిమాన్వితమైన ప్రేమతో నా హృదయం మత్తెక్కింది ....

"నేను బ్రాహ్మణవర్గమను దానిలో పుట్టినా, బ్రాహ్మణుడనుకాదు. భారత దేశంలో పుట్టి నా భారతీయుణ్ణి కాదు" అని ప్రకటించాడు. అలా బ్రతి కాడు.

"నేనెల్లపుడు చాలా పరిశుభ్రంగా వున్నాను .... ఒక కట్టెలా నా దేహాన్ని అగ్నికి ఆహుతి చేయాలి. నాకు జాతీయత లేదు. ఎలాంటి ప్రార్థనలు, ప్రసంగాలు, హడావుడులు, ఆరాధనలు, ఆచార క్రియలు ప్రదర్శనలు, ప్రజాదర్శనాలు వద్దు.

ఈవిధంగా జిడ్డు కృష్ణమూర్తి విశ్వమానవతామూర్తి అయినాడు.

జీవన దర్శన స్ఫూర్తి
వసుధైక కుటుంబ వర్తి
తాత్త్విక యుగ చక్రవర్తి
అతడే, మన కృష్ణమూర్తి.

20-11-1999